# ఆంధ్రపత్రిక



217604


The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 245 THURSDAY 8th DECEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao


# ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి రాష్ట్రప్రధాని అధ్వర్యాన విభజనసంఘ నియామకం

## అధ్యక్షునితో కూడ మొత్తం ఎనిమిదిమంది సభ్యులతో ఏర్పాటు

## ప్రకాశం, వెంకట్రావు, గోపాలరెడ్డి, సంజీవరెడ్డిగారల ప్రాతినిధ్యం: మద్రాసు ప్రభుత్వ నిర్ణయం

చెన్నపట్నం, డిసెంబరు 7: మద్రాసు మంత్రివర్గం వారు నేడు సమావేశమై రాష్ట్రవిభజన సమస్యల పరిశీలన పరిష్కారమునకు 8 గురు సభ్యులు గల విభజనసంఘమును నియమించిరి. ప్రధాని కుమారస్వామిరాజా ఆ సంఘ అధ్యక్షులుగా నియమింపబడిరి. శ్రీ ప్రకాశం, వెంకట్రావు, గోపాలరెడ్డి, సంజీవరెడ్డిగారలు ఆంధ్రుల తరఫున, ఆంధ్రేతరుల తరఫున కుమారస్వామిరాజా, భక్తవత్సలం, మాధవమీనన్, టి. టి. కృష్ణమాచారి గారలు సభ్యులుగా నియమింపబడిరి.

### రాష్ట్రవిభజనకు ప్రత్యేకశాఖ

చెన్నపట్నం, డిసెంబరు 7: ఆంధ్రరాష్ట్ర విభజన విషయమై నియమింపబడు కమిటీ పనిచూచుటకును, రికార్డులు తయారుచేయుటకును సెక్రటేరియటులో "విభజన శాఖ" అనుపేరుతో ఒకదాన్ని కార్యదర్శి అధికారం క్రింద ఏర్పాటుచేయుటకు మదరాసు ప్రభుత్వంవారు నిశ్చయించిరి.

### మంత్రివర్గ సమావేశం

మదరాసు మంత్రివర్గమువారు నేటి మధ్యాహ్నం ఫోర్టుసెంట్‌జార్జి మంత్రివర్గమందిరమున ప్రధాని కుమారస్వామి రాజాగారి అధ్యక్షతను సమావేశమై ఆంధ్రరాష్ట్రనిర్మాణ సందర్భమున కేంద్ర ప్రభుత్వలేఖాంశముల చర్చించు పరిష్కార మార్గాన్వేషణకుగాను ఒక విభజనసంఘమును నియమించిరి. ప్రధాని కుమారస్వామిరాజాగారు అధ్యక్షులు. సభ్యులు: మంత్రి భక్తవత్సలం, మంత్రి మాధవమీనన్, టి. టి. కృష్ణమాచారి, ప్రకాశం పంతులు, కళా వెంకట్రావు, మంత్రి గోపాలరెడ్డి, మంత్రి సంజీవరెడ్డిగారలు. ఈ విభజనసంఘ ప్రథమసమావేశము 8 వ తేదీ మధ్యాహ్నము 11 గం||లకు మంత్రివర్గ మందిరమున జరుగును.

ఈ నిర్ణయమునుగూర్చి పత్రికాప్రతినిధులకు మంత్రిభక్తవత్సలంగారు ఇటుల తెలిపిరి:— ఈ కమిటీవారు పని ముగించుటకు ఒక గడువును ప్రభుత్వము నియమించలేదు. కమిటీవారు డిసెంబరు ఆఖరుకుగాని, జనవరి 15 కు గాని పని ముగించెదమనుకున్న అభ్యంతరము పెట్టువారెవ్వరునూ లేరు. శ్రీ వెంకట్రావుగారు చెప్పినటుల విభజన సంఘములోని ఆంధ్ర తమిళ నాయకులు అన్ని సమస్యలను ఆ తేదీలోపల పరిష్కరింపగల్గినచో మద్రాసు మంత్రివర్గమువారి ఆక్షేపణ ఉండజాలదు. ఆస్తి అప్పులు, రాజధాని, హైకోర్టు, సర్వీసు కమిషను, మున్నగు సమస్యలన్నిటినీగూర్చి వారు తేల్చవలసి ఉన్నది. సరిహద్దులగూర్చి సరిహద్దునిర్ణయసంఘము ఎటులను రాగలదు. ఈ విషయమై ఆఖరు నిర్ణయము భారత ప్రభుత్వం వారిదై ఉన్నది. ఏప్రిల్ 1 వ తేదీ రాష్ట్రమును ఏర్పరుచవచ్చునని మద్రాసు ప్రభుత్వమువారి అభిప్రాయమై ఉన్నది. బళ్ళారి జిల్లాలోని ఆరు తాలూకాలు ఎటుచేర్చవలెనో ఈ సంఘమే నిర్ణయించగలదు."

ఈ విభజన సంఘ కార్యదర్శి అధికారి ఒకరు నిర్ణయింపబడుదురు.

# నైరృతి ఆఫ్రికా ప్రతిపత్తి

## ప్రపంచ న్యాయస్థానం నిర్ణయించాలని ఐక్యరాజ్యసమితి తీర్మానం

ఫ్లషింగ్, మెడోస్, డిసెంబరు 6: నైరృతి ఆఫ్రికాపట్ల దక్షిణ ఆఫ్రికాకు గల విధి బాధ్యతలు ఏమిటి అన్న విషయమై అంతర్జాతీయ న్యాయస్థానం చేత విచారణ జరిపించి తీర్పు చెప్పించవలెనని ఐక్యరాజ్యసమితి జనరలు అసెంబ్లీ ఈవేళ తీర్మానించింది.

ఈ క్రిందజెప్పిన అంశాలమీద ప్రపంచ న్యాయస్థానం తగవు చెప్పవలెను:-

(1) మాండేటరీ ప్రాంతం అయిన నైరృతి ఆఫ్రికాపట్ల దక్షిణాఫ్రికా చెల్లించవలసిన అంతర్జాతీయ విధిబాధ్యత లేమిటి?

(2) నైరృతి ఆఫ్రికా అంతర్జాతీయ హోదాను తానుగా మార్పిడి చేసే అధికారం దక్షిణాఫ్రికా ప్రభుత్వానికి ఉన్నదా? ఈ అధికారం దక్షిణాఫ్రికాకు లేకపోతే, ఎవరికి ఉన్నది?

సమితి ప్రణాళికలో 12 వ అధ్యాయంలో అంతర్జాతీయ ధర్మకర్తృత్వాన్ని గురించి చెప్పిన సూత్రాలు నైరృతి ఆఫ్రికాకు వర్తించునా అన్న ప్రశ్నకూడా తీర్మానంలో చేర్చవలెనని ఒక సవరణ ప్రతిపాదింపబడెను. తీర్మానంతో సహా ఈ సవరణకూడా ఆమోదింపబడెను. సవరణకు అనుకూలంగా 39 వోట్లు, ప్రతికూలంగా 6 వోట్లు వచ్చినవి. 7 గురు తటస్థత వహించిరి. అసలు తీర్మానం ఇండియా, థాయిలాండ్, డెన్మార్క్, నార్వే, సిరియాలచేత సంయుక్తంగా ప్రతిపాదించబడినది. తీర్మానంలోని విషయం కేవలం కార్యక్రమ నిర్వహణా విధానానికి సంబంధించిందనీ, అందుచేత తీర్మానానికి మూడింట రెండువంతుల మెజారిటీ గాకుండా మామూలు మెజారిటీవచ్చినా నెగ్గినట్లే పరిగణింపబడుతుందనీ, అధ్యక్షుడు జనరల్ కార్లోస్ పి. రోమ్యులో తీర్మానమును వోటుకు పెట్టేముందు రూలింగు ఇచ్చెను. తీర్మానమును ఏకమొత్తంగా వోటుకు పెట్టినప్పుడు, అనుకూలంగా 40 మంది, ప్రతికూలంగా 7 గురు వోటు చేసిరి; 4 గురు తటస్థంగా ఊరుకొనిరి. ప్రతికూలంగా వోటుచేసిన రాజ్యాలివి:

దక్షిణాఫ్రికా, బైలోరష్యా, రష్యా, ఉక్రైన్ రష్యా, జెకోస్లొవేకియా, పోలెండు, యూక్రైన్. తటస్థత వహించిన రాజ్యాలు: క్యూబా, యుగోస్లావియా, గ్రీస్, అర్జెంటినా. ఈ విచారణ సందర్భంలో అంతర్జాతీయ న్యాయస్థానం వారికి సహాయకారిగా ఉండగలందులకై వారి పరిశీలనకు నివేదించవలసిన డాక్యుమెంట్లు ఏవో పేర్కొంటూ మరో క్లాజుకూడా ప్రతిపాదించబడినది. నైరృతి ఆఫ్రికాలోని హీరరో తెగజాతుల తరఫున రెవరెండ్ మైఖేల్ స్కాట్ ధర్మకర్తృత్వ సంఘం యెదుట ఇచ్చిన సాక్ష్యంకూడా ఈ డాక్యుమెంట్లలో పేర్కొనబడింది. ఈ క్లాజు 1 వోటు మెజారిటీతో ఆమోదింపబడెను. క్లాజుకు అనుకూలంగా 22 వోట్లు, ప్రతికూలంగా 20 వోటు వచ్చినవి; 11 మంది తటస్థంగా ఊరుకొనిరి.

నైరృతి ఆఫ్రికా పరిపాలనపై నివేదికలు అందజేస్తూ ఉంటామని యూనియన్ ప్రభుత్వం ముందు మాటయిచ్చి, తరువాత ఆ వాగ్దానాన్ని ఉపసంహరించినందుకు విచారం వెలిబుచ్చుతూ జనరల్ అసెంబ్లీ


(4-వ పేజీ చూడుడు)


# త్వరలో చైనా ప్రభుత్వ పతనం తథ్యం

## ఫార్మోజా ప్రయాణానికి చాంగ్ నిశ్చయం

హాంకాంగ్, డిసెంబరు 7: కొమింటాంగ్ ప్రభుత్వం చైనా ప్రధాన భూభాగాన్ని వదిలిపెట్టి ఫార్మోసాకు ఉపసంహరించుకొనటమన్నది ఏ క్షణంలో నైనా జరగవచ్చునని ఇక్కడ భావించబడుతున్నది.

ఇండోచైనా సరిహద్దుల కానుకని ఉన్న యూనాన్ రాష్ట్ర రాజధాని కన్మింగ్‌లో కొమింటాంగ్ రాజధానిని పెట్టాలన్న ఉద్దేశాన్ని, తన సైనిక పరిస్థితి అతిత్వరితంగా క్షీణించిపోవటం వల్ల, చాంగ్ కైషేక్ మార్చుకున్నాడని తెలుస్తున్నది.

కొమింటాంగ్ ప్రస్తుత రాజధాని చెంగ్టూ మీదకి తోసుకువస్తున్న రెండు కమ్యూనిస్టు సైన్యాలవల్ల చాల ప్రమాదస్థితిలో పడెను. కమ్యూనిస్టు సైన్యాలు రెండింటికీ ప్రతిఘటన అనేది లేదనే చెప్పవచ్చును. ప్రస్తుతం నగరాన్ని క్షీస్తున్న చాంగ్ కైషేక్ రక్షణ అసాధ్యమని తెలియగానే, కొంతమంది కొమింటాంగ్ నాయకులతో సరాసరి ఫార్మోసాకు విమానాల్లో వెళ్ళిపోతాడు. విమానాలు సిద్ధంగా ఉన్నవి.

కొమింటాంగ్ సేనలు యూనాన్ రాష్ట్రంలోకి వెళ్ళి అక్కడి నుంచి ప్రతిఘటించే అవకాశం లేకుండా చేయాలని చెంగ్టూ కన్మింగ్‌ల మధ్య ఉన్న రహదార్లన్నిటినీ ఛేదిస్తున్నారు.

ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యంకలిగించుకున్నదనీ, తద్వారా తనతో చేసుకున్న ఒడంబడికను భగ్నంచేసినదనీ కొమింటాంగ్ చైనా చేసిన ఫిర్యాదును చిన్న సమితికి ప్రతిపాదించటానికి రాజకీయ సంఘం ఈవేళ నిశ్చయించింది. తీర్మానానికి అనుకూలంగా 28, వ్యతిరేకంగా 19 వోట్లు వచ్చినవి. 14 మంది సభ్యులు తటస్థంగా ఉన్నారు.

చిన్న సమితి కొన్ని కొన్ని వ్యవహారాలను విచారించటానికి సమితిచే నియమించబడ్డ శాశ్వతసంస్థ. దీనిని సోవియట్ బృందం మొదటినుంచీ బహిష్కరిస్తున్నారు.

### రష్యాపై కొమింటాంగ్ ఫిర్యాదు

లేక్‌సక్సెస్, డిసెంబర్ 6: సోవియట్ రష్యా చైనా కమ్యూనిస్టులకు తోడ్పడి తం

# సంస్థానకాంగ్రెస్ విభేదాల పరిష్కార యత్న వైఫల్యం

## భారతకాంగ్రెస్ ప్రముఖులతో సంప్రతించుటకై ఢిల్లీకి హైద్రాబాద్ నాయకుల ప్రయాణం

(స్వకీయ విలేఖరి)

హైద్రాబాదు, డిసెంబరు 7: హైద్రాబాదు సంస్థాన కాంగ్రెసు విభేదాల శాశ్వత పరిష్కారం నిమిత్తం ఉభయ పక్షాల మధ్య జరుగుతున్న సంప్రదింపులు భగ్నమైపోయినవని నిన్నరాత్రి యిక్కడ తెలియవచ్చింది.

సంస్థాన కాంగ్రెసు అధ్యక్షులు స్వామి రామానంద తీర్థ, దిగంబరరావు బిందూ, బూర్గుల రామకృష్ణరావు, జి. రామాచారి గారలు నేటి ఉదయం విమానంలో ఢిల్లీ వెళ్లారు. ఢిల్లీలో వీరు భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షులు డా॥ పట్టాభి సీతారామయ్యపంతులు గారిని, నెహ్రూగారిని, పటేల్ గారిని కలుసుకొని పరిస్థితులను చర్చిస్తారని తెలుస్తున్నది.

సంప్రదింపులు భగ్నమైన అనంతరం, స్వామి రామానంద తీర్థగారు పోటీపక్ష నాయకుడైన బూర్గుల రామకృష్ణరావు గారికొక లేఖ వ్రాస్తూ, రామకృష్ణరావు, దిగంబరరావు బిందుగార్ల మధ్య జరిగిన సంప్రదింపులనుగురించి తాను బాగుగా ఆలోచించినట్లు తెలియజేశారని తెలుస్తున్నది.

హైద్రాబాద్ సంస్థాన కాంగ్రెసు అధ్యక్షపదవి కొన్ని రాజకీయ సూత్రములతో సమ్మిళితమై ఉన్నదనీ, యీ విషయంలో తానుయిదమిద్ధమని నిర్ణయం చెయ్యటంవల్ల సంస్థానమంతటా దాని ప్రభావం ఉండవచ్చనీ ఆయన అభిప్రాయపడ్డారు. అధ్యక్షపదవి ఎన్నిక విషయాన్ని ప్రజా నిర్ణయానికి వదలివేయటం సముచితంకాగలదన్నారు. అందులో తాను పోటీ చెయ్యటంగాని, ఉపసంహరించుకోవటంగాని, యీ విషయం కేవ


(4-వ పేజీ చూడుడు)


# గాంధి హత్యకేసు విచారణ ఖర్చులు

## సర్దార్‌పటేల్ ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబర్ 7: గాంధి హత్యకేసు విచారణకు మొత్తం 9,64,888 రూపాయలు ఖర్చయ్యిందని ఉపప్రధాని సర్దార్ పటేల్ నేడు పార్లమెంటులో మహావీర్ త్యాగి అడిగిన ప్రశ్నకు సమాధానమిస్తూ వెల్లడించారు.

ఇందులో 3,86,218 రూపాయలు ప్రాసిక్యూటర్ దప్తరుకీ 1,88,848 రూపాయలు పేట్చెర్ధార్ అనే సహాయ ప్రాసిక్యూటర్‌కూ, 1,08,888 రూపాయలు పా అనే సహాయ ప్రాసిక్యూటర్‌కూ ఫీజుక్రింద ఇవ్వబడినవి.

తిరుచి, డిసెంబరు 6:-ద. ఇ. రైల్వేయందు దొడ్డంపట్టి—సామంపట్టి స్టేషనుల మధ్య రైలుమార్గం సరిచేయబడినదని సేలం డి. టి. ఎస్ తెలిపి నంపెను.

# "జనవరి 26 లోపల రాష్ట్రాన్ని విభజించడం ఎవరికీ సాధ్యంకాదు"

## ఆంధ్రరాష్ట్రనిర్మాణముపై మద్రాసు ప్రధాని ప్రకటన

చెన్నపట్నం, డిసెంబరు 7: "జనవరి 26 లోపల రాష్ట్రాన్ని విభజించాలంటే మానవులకు సాధ్యంగాదు సరేగదా, ఆ భగవంతుడికైనా సాధ్యంకాదు. అందువల్లనే ఏప్రిల్ 1 వ తేదీకి ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికై అన్ని యత్నాలు చేస్తామని కేంద్ర ప్రభుత్వానికి వ్రాశాము. 'మేము చెయ్యగలమేమో' అని మాత్రమే వారు అడిగారు. వారు చెప్పినవన్నీ పరిష్కారం కావు 'అని స్పష్టంగా వ్రాసివేశాము. ఏప్రిల్ 1 వ తేదీకి అన్ని ప్రయత్నాలు చేస్తాము అన్నాము అప్పటికైనా విభజన సంఘంవారి నిర్వహణ, చురుకుపైన ఆధారపడిఉన్నది" అని నేడు మద్రాసు ప్రధాని పత్రికా ప్రతినిధులతో ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమునుగూర్చి మాట్లాడుతూ తెలిపిరి.

విభజన సంఘ కార్యక్రమమునుగూర్చి ప్రధాని మాట్లాడుచూ విభజన సంఘము వారు కార్యవిధానమును నిర్ణయించుకొందురు. సాంకేతిక విషయములకు ఆయా


(4 వ పేజీ చూడుడు)


# "కృష్ణాజిల్లాలో కమ్యూనిస్టు చర్యల అధ్యాయం ముగిసిపోయింది"

## నవరగూడెంలో అక్రమ సారస్వతం వశపర్చుకున్న పోలీసు అధికారి వివరణ

విజయవాడ, డిసెంబరు 5: ప్రత్యేక డి. వై. ఎస్. పి. అయిన ఎస్. పలనియప్పన్ గారు ప్రత్యేక పోలీసు ఇన్స్పెక్టరు అమీరుల్లాబేగ్ గారి సహాయంతో మలబార్ ప్రత్యేక పోలీసుదళమును వెంటబెట్టుకుని నవరగూడెం గ్రామంపై దాడి చేసి, కమ్యూనిస్టు గ్రంథాలను, ప్రకటనలను, పార్టీకి సంబంధించిన ఇతర పత్రాలను దాచిన మూడు పెట్టెలు స్వాధీనపరచుకున్నారు.

ఈ సందర్భంలో పసుపులేటి వెంకటనారాయణ, రామిసెట్టి లక్ష్మీనారాయణ అను ఇద్దరు కమ్యూనిస్టులను, (అజ్ఞాతవాసులు) అరెస్టు చేశారు.

హైదరాబాదు సంస్థానంలో మధిర


(4 వ పేజీ చూడుడు)

# ఉ॥ వి॥ జిల్లా కాంగ్రెస్ అధ్యక్షస్థానం

## గౌతులచ్చన్నగారి ఎన్నిక

'వంశధార'గా జిల్లాపేరు మార్చాలని సర్వసభ్య సమావేశ తీర్మానం

శ్రీకాకుళం, డిసెంబరు 4 : నిన్న సాయంత్రం ఆముదాలవలస రహదారీ బంగళా ఆవరణలో నూతన ఉత్తర విశాఖ జిల్లా కాంగ్రెస్ సర్వసభ్య సమావేశం ప్రస్తుత జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ గౌతు లచ్చన్న యం. యల్. ఎ. గారి అధ్యక్షతను జరిగినది.

ఈ సమావేశమునకు సాలూరు, బొబ్బిలి, పార్వతీపురం, పాలకొండ, శ్రీపురుపల్లి తాలూకాల నుండియూ గంజాం కోరాపుట్టు జిల్లాలలోని రాయగడ, గుణుపురం పర్లాకిమిడి, బరంపురం, ఛత్రపురం తాలూకాల నుండియూ, శ్రీకాకుళం, నర్సన్నపేట, పాతపట్నం, టెక్కలి, సోంపేట, ఇచ్ఛాపురం తాలూకాలనుండియూ 130మంది జిల్లా కాంగ్రెసు సభ్యులు, 200 మంది కాంగ్రెసు సేవకులు, అభిమానులు వచ్చిరి.

అధ్యక్షులు గౌతు లచ్చన్న గారు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘము వారి ఆమోదమునకు లోబడి ఉ॥ విశాఖ జిల్లా కాంగ్రెసు కార్యవర్గమునకు 16 తాలూకాలకు 26 మందికి మించకుండా సభ్యులను ఎన్నుకొనవలెనని ప్రతిపాదన చేసిరి.

1950 సంవత్సరమునకు కార్యవర్గమును ఎన్నుకొనుటకు ముందు గత సంవత్సరపు జమాఖర్చులు ఆమోదించబడెను. రు 8202 ఆదాయము 8190 ఖర్చు మిగులు రు. 12/-

అధ్యక్ష పదవికి గౌతులచ్చన్నగారితో అబ్దుల్ రహిమాన్‌గారు పోటీ చేసిరి. లచ్చన్నగారికి 113, అబ్దుల్ రహిమాన్ ఖానుకు 16 ఓట్లువచ్చి 1 ఓటు రద్దయినది.

మిగత కార్యవర్గమును, 16 తాలూకాలకును ప్రాతినిధ్యము కలుగునట్లు నిర్ణయించవలసినదిగా నూతన అధ్యక్షునకు అధికారమిచ్చుచూ సభ్యులు యేకగ్రీవముగా తీర్మానించిరి.

కార్యవర్గమున యిద్దరు ఉపాధ్యక్షులు యిద్దరు సంయుక్త కార్యదర్శులు, ఒక ప్రధానకార్యదర్శి తాలూకాకొక కార్యనిర్వాహకసభ్యుడు యుందురు.

1950 సం॥ రమునకు బడ్జెటును ఆమోదించుటకు నూత్న కార్యనిర్వాహకవర్గము 5 తేదీని సమావేశము కావలెనని నిశ్చయించబడెను.

ఎన్నికల విచారణసంఘము, ఆర్థికా నిర్ణయసంఘములకు దుక్క రాజన్నరెడ్డి, గొర్లె సూర్యనారాయణ, నాయని వెంకటప్పయ్యగార్లు యెన్నుకోబడిరి.

11, 12, 13 తేదీలలో ఉ॥ వి॥ జిల్లాలో మదరాసు ఆర్థికమంత్రి గౌ॥ బెజవాడ గోపాలరెడ్డిగారు సంచారముచేయుటకుగాను జిల్లా కాంగ్రెసు తయారుచేసిన కార్యక్రమమును ఆమోదించుచూ, ఉత్తర విశాఖలో వరదలవల్ల విశేషభాగమునుగి పంటలుపోయి మేటలువేసి, గృహనాశనమై అమితనష్టం సంభవించినందున, ఈ జిల్లా బాధితులకు గవర్నరు నిధినుండి తగు సహాయమును యిప్పించవలెనని, మేట వేసినభూముల వ్యవసాయదారులకు స్వల్పవడ్డీరి ఋణాలు యివ్వాలనియూ, విత్తనాలు యిప్పించాలనియూ, శ్రీమంతులు ఉదారహృదయులుధనవస్తుసహాయం వరదబాధితులకు చేయాలనియూ, యిండ్లు వస్త్రాలు పోయినవారికి కనీసపు రు. 100/లు గృహనిర్మాణానికై ప్రభుత్వమివ్వాలని వారు తీర్మానించిరి.

బంజరు భూములకు భూమిలేనిరైతులకు సాగుకుయిచ్చి అధికాహారోత్పత్తికి ప్రభుత్వం పూనుకోవాలనికూడా తీర్మానించిరి.

ఉత్తరవిశాఖజిల్లాకు 'వంశధారజిల్లా' యని ప్రభుత్వం నామకరణము చేయాలని కళింగపట్నం — ఆముదాలవలస — పాలకొండమీదుగా పార్వతీపురమునకలుపుచు రైలుమార్గము సాధ్యమైనంత వేగమే వేసి ఈ ప్రాంతంప్రజలకు రెయిల్వేసదుపాయము కలిగించవలెనని సంఘసభ్యులు తీర్మానంచేశారు. (స్వ. వి.)

# ఇసుకపల్లి థక్కర్ బాబా విద్యానిలయం

రేపల్లె, డిసెంబరు 3 : ఇసుకపల్లి థక్కర్‌బాబా విద్యాలయం యాజమాన్యమున నడుపబడుచున్న ఖాదీశిక్షణ విద్యాలయమునందు 1950 జనవరి 1 వ తేదీనుండి రెండవజట్టుకు శిక్షణ యివ్వబడును. శిక్షణ పొందువారికి నెలకు రూ 30 స్టయిఫండు యివ్వబడును. మద్రాసు ప్రభుత్వ ఖాదీ అభివృద్ధి ప్రణాళిక ప్రకారము, ఏకుటు వడుకుట నేతనేయుట అద్దకం, రంగువేయుట నేర్పబడును. గాబట్టి డిసెంబరు 15 లోగా తమ అర్జీలు కార్యదర్శి వి అన్నపూర్ణమ్మ, థక్కర్ బాబా విద్యానిలయం, ఇసుకపల్లి, రేపల్లె, గుంటూరుజిల్లాకు పంపవలెను.

# సంగ్రహ వార్తలు

## గుంటూరు

గుంటూరుపట్టణ వెనుకబడిన జాతుల సంఘ కార్యవర్గ సమావేశము 4-12-48 తేదీన గుంటూరుపట్టణ కాంగ్రెసు ఆఫీసులో ఆకురాతి ఆంజనేయులుగారి అధ్యక్షతక్రింద జరిగినది. రాష్ట్ర వెనుకబడిన జాతుల ఆహ్వానసంఘమునకు పట్టణసంఘం నుండి తాము సూచించిన సభ్యులను కోఆప్టుచేసుకొనవలసినదిగా కోరుచు వారు తీర్మానించిరి. ఇంకొ కొన్ని ముఖ్యమైన తీర్మానములు చేసిరి.

## ఏలూరు

పట్టణ విద్యార్థి కాంగ్రెస్ సర్వసభ్య సమావేశము గతనెల 29 వ తేదీ సాయంత్రము గం.లకు పాత జిల్లా కాంగ్రెస్ ఆఫీసులో శ్రీ సోమించి లింగయ్యగారి అధ్యక్షతను సమావేశమయినది. పట్టణ విద్యార్థి కాంగ్రెస్ కార్యదర్శి వాకమూడి నారాయణరావుగారు 1948-49 వ సంవత్సరము నివేదికను సభ్యులకు చదివి వినిపించినారు.

నూతన అధ్యక్ష, కార్యదర్శుల ఎన్నికలో పి.జి. విధిగన్నా రామణగారు అధ్యక్షుడుగాను, టి. కొండలరావుగారు కార్యదర్శిగాను సభ్యులచే ఏకగ్రీవముగా ఆమోదింపబడిరి. టి. లోకేశ్వరరావుగారు ఉపాధ్యక్షుడుగనూ, శ్రీమతి వి. రమాదేవి, టి. వి. ఎస్. నరసింహమూర్తిగార్లు సహాయ కార్యదర్శులుగనూ నియమింపబడిరి.

## తెనాలి.

తెనాలి మారిసుపేటలో మోహన ఇండస్ట్రీస్ లిమిటెడ్ కార్యాలయ ప్రారంభోత్సవం వెలువోలు సీతారామయ్యగారిచే గావింపబడెను.

## పెనుకొండ

ఈ యూరియందు సుమారు 3 నెలలుగ దక్కెర అమ్మబడలేదు. ఈ నెల 8 వ తేదీన రివిన్యూ డివిజనల్ ఆఫీసరుగారి యుత్తర్వుపై స్థానిక రేషన్ డీలర్లు, హిందూపురం కోఆపరేటివ్ స్టోర్సు డిపో నుండి 70 మూటలు తెచ్చినారు. రాబోవు వారమునుండి, కార్డుకు 6 సేర్లు వంతున యిచ్చెదరని తెలియుచున్నది.

## నిడుబ్రోలు

మునుపర్తిలో అపరేటివ్ మార్కెటింగు సంఘంవారి సర్వసభ్య సమావేశం నవంబరు 29వ తేదీన దాసరి వెంకట సుబ్బారావుగారి అధ్యక్షతన నిడుబ్రోలులో జరిగింది. 403 గురు సభ్యులు హాజరయ్యారు. నూతన డైరెక్టర్ల ఎన్నిక జరిగింది. పోటీ చేసిన 18గురు అభ్యర్థులలో 7గురు అధిక సంఖ్యాబలంతో ఎన్నుకోబడ్డారు.

## పామర్రు

ఈ ఊరిలో ఈనెల 1 వ తేదీన ఘట్టి లక్ష్మీనారాయణగారి అధ్యక్షత క్రింద భారతీ సమితి సభ జరిగింది. కోగంటి దుర్గామల్లికార్జున రావుగారు కార్యదర్శి నివేదికను చదివారు. టి. వి. సుబ్బయ్య, వి. భ్రమరాచార్యులు, బండి వెంకట సుబ్బయ్య, గుర్నపల్లి రామబ్రహ్మం, సూరపనేని సుబ్బయ్యగార్లు వివిధ సాంస్కృతిక విషయాలపై ఉపన్యాసాలిచ్చారు. 'ఆంధ్రీ తరులారా' అను పద్యములను దుర్గామల్లికార్జున రావు గారు చదివారు.

## తిరువూరు

ఇంపీరియల్ పౌరులు, జిల్లాబోర్డు సభ్యులైన సుగ్గుంటి సంకటప్పయ్యగారి అధ్యక్షతను డిసెంబరు 1న సభజరిపి, జిల్లా బోర్డువారు తిరువూరు బోర్డు హైస్కూలులో తగు శ్రద్ధ తీసుకొని వారి శాలకుగల ఉపాధ్యాయుల కొరతను తీర్చవలసిందని కోరుతూ ఒక తీర్మానం చేశారు.

## అనకాపల్లి

ఈనెల ఒకటవ తేదీన గాంధీ ఆశ్రమంలో 'గీతాజయంతి' మహోత్సవం వైభవంగా జరిగింది. గీతామండలి, శారదా గ్రంథాలయం వారల ఆధ్వర్యాన గీతాచార్యుని ఆరాధన, నగరసంకీర్తనం, బహిరంగ సభ, ఉపన్యాసాలు, ఉపనిషత్పారాయణ, భగవద్గీత హరికథా కాలక్షేపం జరిగినవి.

## తిరుపతి

తిరుపతి శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య కళాశాల ఆంధ్ర విద్యాభివర్ధనీ సమాజములో నవంబరు 29 న పరవస్తు రామానుజస్వామిగారు ప్రారంభోపన్యాసము చేసిరి. సి. అన్నారావు గారు (దేవస్థానం కమిషనర్) సభకు అధ్యక్షత వహించారు.

విద్వాన్ పాతాళభేది సుబ్రహ్మణ్య కవి గారికి (ప్రధానాంధ్రోపన్యాసకులు) శ్రీమదమృతానంద జయంతి సందర్భమున విజయవాడ శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యా పీఠంవారొసగిన "కవికుల శిరోభూషణ" అనే బిరుద సమ్మోద సభ కూడ జరిగినది. (స్వ. వి.)

## మంగళగిరి

తుపాను, వరద బాధితుల సహాయక సంఘము వారు బాధితులకు చీరలు, ధోవతులు యిచ్చుటకై తాడేపల్లి మొదలైన గ్రామాలలో పంచి యిచ్చుచున్నారు. 10 వేల రూపాయల కిమ్మతు గల వస్త్రములు బాధితులకు పంచి పెట్టబడునని స్థానిక డిప్యూటీ తహశీల్‌దారు పి. సీతారామయ్య గారు చెప్పిరి.

## ముదునూరు

ఈ గ్రామ యువజన కాంగ్రెసు సాధారణ సభ్యుల సమావేశం కొల్లి వెంకటేశ్వరరావు గారి అధ్యక్షతను జరిగినది. నూతన సంవత్సరానికి అధ్యక్షులుగా శ్రీ పాలకుర లక్ష్మయ్య కార్యదర్శి ముక్తినేని వెంకట్రామయ్య గార్లు ఎన్నుకొనబడినారు.

## కర్నూలు

డిసెంబరు ఒకటవ తేదీన స్థానిక ఉస్మానియా కాలేజీ మదరాసు శాసన సభ్యుడు ఎస్. ఎస్. వరదాచారిగారు 'ఆంధ్రరాష్ట్రము— దాని స్వరూపము' అను విషయమై ప్రసంగించారు. నూత్న రాష్ట్రరాజధాని కోస్తా జిల్లాలలో కాక రాష్ట్రమధ్యస్థలంలో ఉండాలని ఆయన సూచించారు.

వైజ్ఞానిక సమాజంవారు ఏర్పరచిన బహిరంగ సభలో మాట్లాడుతూ, కంట్రోల్లు, రేషనింగు తీసివేయటం పెద్ద నరుస్య కాదని, మదరాసు ప్రభుత్వం నూతులకు యిస్తున్న సబ్సిడీలను నిలిపి వేయటం విచారకరమని వరదాచారిగారు అన్నారు.

నవంబరు 27 వ తేదీన కర్నూలు మండల లలిత కళాపరిషత్తు ఆధ్వర్యాన కోల్సు హైస్కూల్ ఆంధ్రపండితులైన శ్రీ పుల్లా పంతుల వెంకటరామశర్మగారు అష్టావధానమును గావించి సభ్యుల నానంద పరవసుల గావించారు.

పై అవధానమునకు తిరుపతి వెంకటేశ్వర కళాశాల ఆంధ్రోపన్యాసకులైన శ్రీ జి రెడ్డి చెన్నారెడ్డి గారు అధ్యక్షత వహించిరి. అవధానానంతరము శతావధాని కారావజ్జల రామకృష్ణ శాస్త్రిగారు అష్టావధానిగారి సామర్థ్యమెంచిరి. ఎల్. వి. సుబ్బరాయ శాస్త్రిగారు అవధానిగారిని సమ్మానించారు. విద్వాన్, జాఫ్రుద్ సాహెబ్ గారు అవధానిగారిని ప్రశంసిస్తూ మాట్లాడిరి. పరాయితము కృష్ణమూర్తి శాస్త్రిగారి వందనసమర్పణతో సభ ముగిసినది.

## హిందూపురం

ఈ నెల రెండవ తేదీన స్థానిక వయోజన విద్యాకేంద్రములో మునిసిపల్ హైస్కూలు ఉపాధ్యాయులు దుర్భాక కృష్ణయ్యగారు 'గ్రంథాలయవిజ్ఞానము' అను విషయంపై ఉపన్యసించిరి. విద్యాకేంద్ర ప్రధానోపాధ్యాయులు అధ్యక్షత వహించిరి.

ఈ 3 వ తేదీన ఇచ్చటికి 11 మైళ్ళ దూరంలోనన్న కంచి సముద్రములో అనంతపురం పోస్టలు ఇన్‌స్పెక్టరు టి. మునిరెడ్డిగారు నూతనముగ ఒక బ్రాంచి పోస్టాఫీసును ప్రారంభించిరి. కిరు గడచిన రెండు మాసముల కాలవ్యవధిలో ఇట్టి నాలుగు బ్రాంచి పోస్టాఫీసులు ప్రారంభింపబడినవి.

నవంబరు 28 సాయంత్రం ప్రభుత్వ వయోజన విద్యాకేంద్రమువారి ఆధ్వర్యమున ఏర్పాటైన సభలో స్థానిక మునిసిపల్ హైస్కూలు ఉపాధ్యాయులు దుర్భాక కృష్ణయ్య గారు "గ్రంథాలయములు — వయోజనవిద్య" అను శీర్షికపై ఉపన్యాసమొసంగిరి. స్కూల్ డిప్యూటీ ఇన్స్పెక్టరు వేదాల శ్రీనివాస గారు అధ్యక్షత వహించియుండిరి. అధ్యక్షులు గ్రంథాలయముల ప్రయోజనమును గురించి దీర్ఘముగ వివరించిరి. ప్రధానోపాధ్యాయులు ప్రకాశరావుగారి వందన సమర్పణతో సభ ముగిసెను.

## నిడదవోలు

ఈచుట్టుప్రక్కల గ్రామాలలో అక్కడ వరి కోతలు, చాలాభాగం కుప్పనూర్పులుకూడా పూర్తి అయినవి. రెండు న్యూటదినాల్లో అంచనాల ప్రకారం అక్కడ్లపంట తుపానువల్ల సగానికి సగం దెబ్బతిన్నదని తెలియుచున్నది. కాని ప్రస్తుత పరిస్థితులను బట్టిచూస్తే నూటికి 75 లగాయితు 80 వరకూ నష్టముండునని తెలియుచున్నది. 20 బస్తాలు పండే చేలో నాల్గుబస్తాలురాలినవి. మరొక చోట 81 బస్తాలు పండే చేలో 6 బస్తాలు రాలినవి. రైతులలో పుత్సాహము కాన్పించుట లేదు.

## కాకినాడ

పి. ఆర్. కాలేజీ చరిత్ర అర్థికశాస్త్ర సంఘ ప్రారంభోత్సవం ప్రిన్సిపాలు శ్రీ పి. భద్రయ్య నాయుడుగారు ఈ నెల 25 వ తేదీన జరిపిరి. డి. రామకృష్ణారావుగారు సభకధ్యక్షత వహించిరి.

సంఘ విద్యార్థి అధ్యక్షుడు గొట్టుముక్కల రాధాకృష్ణగారు ప్రపంచ దృష్టిలో అర్థశాస్త్రానికి, చరిత్రకుగల ప్రాముఖ్యత వివరించారు.

భద్రయ్యనాయుడుగారు విద్యార్థులకు హితబోధంసంచు వారు స్వార్థరహిత సేవకులుగా తయారుకావలెననియు, ఆంధ్ర రాష్ట్ర పురోభివృద్ధికి కృషి చేయవలెననియు చెప్పిరి.

కార్యదర్శి ఎం. ఐ. షరీఫ్‌గారు అభినందనములు చెప్పిరి. స్కూళ్లలోనూ, కాలేజీలలోనూ జీతములు హెచ్చించినందువల్ల విద్యార్థులు చాల యిక్కట్లు పడుచున్నారనియు, యీ విషయమై ప్రభుత్వము కలుగజేసుకొని తక్షణమే విద్యార్థులకొరకై తగిన సహాయము చేయవలసినదిగాను కోరిరి.

# తుపాను బాధిత సహాయనిధి

## విద్యార్థుల విరాళం

కావలి, డిసెంబరు 5 : స్థానిక బోర్డు హైస్కూలు విద్యార్థులు నిన్న సాయంకాలము నెల్లూరు జిల్లాబోర్డు అధ్యక్షులైన నలపాటి చెంచురామానాయుడు గారి యధ్యక్షతను, తుపాను బాధితుల సహాయార్థము, వినోద ప్రదర్శనములను జరిపి తుపాను సహాయనిధికి రు 201/- లు సమర్పించిరి. ఆంధ్రదేశమున ముందంజ వేసి తక్కిన వారికి మార్గదర్శకులైన విద్యార్థులను, అధ్యక్షులు ప్రశంసించిరి.

# పెనుకొండ చోరీ కేసు

పెనుకొండ, డిసెంబర్ 4 : ఈ ఊరి నగల వర్తకుడు ఆదిశేషయ్య గారి అంగడి సుమారు రెండు నెలల క్రిందట చోరీ చేయబడిన సందర్భంలో కేసును దర్యాప్తు చేయుచు పోలీసువారు, యీ గ్రామ వాస్తవ్యులగు అయ్యప్ప, మరి యిద్దరిని అరెస్టు చేసిరి. ఈ ముగ్గురికి సబ్ మేజిస్ట్రేటు గారు 15 దినములు రిమాండు ఉత్తర్వు చేసిరి.

అయ్యప్పపై పోలీసు వారు కేసు పెట్టనందున, మేజిస్ట్రేటుగారు అతనిని విడుదల చేయుమను, మిగిలిన యిద్దరిపై ఛార్జి పత్రం దాఖలు చేసినందున వారికి రిమాండు పొడిగించుమను, ఉత్తర్వు చేసినట్లు తెలియుచున్నది. స్వ. వి.

# చిత్తూరు జిల్లా బోర్డు అధ్యక్షుని పర్యటన

నగరి, డిసెంబరు 4 : చిత్తూరు జిల్లా బోర్డు అధ్యక్షుడు ఎస్. వి. చెంగల్రాయ నాయుడు గారు చిత్తూరు నుండి డిసెంబరు 11 న కారులో బయలుదేరి మధ్యాహ్నం 3 గంటలకు మదనపల్లి చేరుకొందురు. అచ్చట నుండి 12 వ తారీకున పుదయం 9 గం॥ లకు భూమిరెడ్డిపల్లి అచ్చట వ్యవసాయ పొలాలకు కావలసిన స్థలమును పరిశీలించి, 13 వ తారీకున కొత్తకోట, 14 వ తారీకున ములకల చెరువు వెళ్లి, అచ్చటి నుండి తిరిగి మదనపల్లి చేరుకుందురు. 15 వ తారీకున మదనపల్లిలో మకాం చేసి 16 వ తేదీన చిత్తూరు చేరుకుందురు. స్వ. వి.

# 'నాదేశ్వరి' కావ్య ఆవిష్కరణ

నంద్యాల, నవంబరు 30 : పేపుల్సు అసోసియేషన్ మైదానములో కళాప్రపూర్ణ చిలుకూరు నారాయణరావుగారి అధ్యక్షతన రాయసం శేషగిరిరావుగారు రచించిన 'నాదేశ్వరి' కావ్య ఆవిష్కరణ సభ గతవారంలో జరిగినది. పురజనులు అనేకులు, కవితా కళాభిమానులు సభకు విచ్చేసినారు, కవిగారు తమ కావ్యమును సంపూర్ణముగా చదివి, సభాసదులను ఆనందసముద్రులుగా చేసిరి. మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రి, జి. రామిరెడ్డి, డి. కె. నాగరాజరావుగారలు కావ్యమును ప్రశంసిస్తూ ప్రసంగించిరి. చిలుకూరి నారాయణరావుగారు కావ్యమును, కర్తను ప్రశంసిస్తూ ప్రసంగించారు. స్వ. వి.

# గుంటూరుజిల్లా విద్యార్థి కాంగ్రెసు సంఘం

గుంటూరు, డిసెంబరు 3 : ఈ జిల్లా విద్యార్థి కాంగ్రెసు అధ్యక్షుడు కామిశెట్టి వెంకటేశ్వర్లుగారిట్లు వ్రాస్తున్నారు:

డిసెంబరు 24 నుండి ప్రథమ ఆంధ్ర విద్యార్థి ఒలింపైడ్, డిసెంబరు 31, జనవరి 1, 2 తేదీల్లో ఆంధ్రరాష్ట్ర విద్యార్థి కాంగ్రెసు మహాసభలు విజయవాడలో జరుగనున్నవి. పై మహాసభలకు జిల్లాలోని ప్రతి స్థానికవిద్యార్థి కాంగ్రెసు సంఘం ప్రతి 25 మంది ప్రాథమిక సభ్యుల కొక ప్రతినిధి చొప్పున ఎన్నుకొని ఆ ప్రతినిధులజాబితా ప్రతినొకదానిని రాష్ట్రమునకు, జిల్లాసంఘానికి కొకటి డిసెంబరు 15వ తేదీకల్లా పంపవలెను. 15 వ తేదీకల్లా ప్రతినిధులజాబితా సభ్యత్వ పుస్తకములు, రుసుము, నూతన సంవత్సర కార్యనిర్వాహకవర్గపు పేరుజిల్లాసంఘానికి పంపవలెను. పైనానిలో ఏఒక్కటి సకాలములో పంపకపోయినను అట్టి స్థానిక సంఘములుమహాసభలలో పాల్గొనుటకు ఏ విధముగను అర్హత కల్గియుండవు.

# పీపింగ్ రేడియో అసభ్య ప్రకటనలు

## కమ్యూనిస్టుచైనా పరిగణనకు అడ్డురావని నెహ్రూ

ఢిల్లీ, డిసెంబరు 6: కమ్యూనిస్టు చైనా ప్రభుత్వము తాలూకు పీపింగునగరంలోని రేడియో యిటీవల భారతదేశమును గూర్చియూ ఇండియా ప్రధానమంత్రిని గూర్చియు ఆక్షేపణకరమైన మాటలుపల్కెను. ఆవిషయమై నేడు ఇండియా పార్లమెంటులో కొంత చర్చ ప్రశ్నోత్తరముల సమయంలో జరిగెను. ఆర్. కె. సిధ్వాగారు అడిగిన ప్రశ్నకు ప్రధానమంత్రి నెహ్రూగారిట్లు చెప్పిరి: అటువంటి భావమును పీపింగు రేడియో టిబెట్టుకు సంబంధించిన కొన్ని వ్యవహారముల సందర్భములో వాడియుండెను. మీరు తెలియచేసినవార్త నిరాధారమైనది. అట్టి కింవదంతివార్త పత్రికలలో ఖండింపబడెను. ప్రస్తుతం ఏర్పడియున్న విశిష్ట పరిస్థితులలో ఏ విధమైన చర్యలను జరుపుట అవసరమని తోచుటలేదు.

కామతుగారు ఇండియాలోని కమ్యూనిస్టుపార్టీ వారు ఇటీవల చైనాలోఏర్పడిన కమ్యూనిస్టుప్రభుత్వాన్ని అభినందించుచు పంపిన సందేశమునకు పీపింగు ప్రభుత్వం పంపిన ప్రత్యుత్తరములో కూడా అటువంటిభావ. ఉపయోగింపబడినమాట నిజంకాదా? ఇదంతయును ఇటీవల పత్రికలలో ప్రకటింపబడెను.

ప్రధానమంత్రి:- ఆ రెండింటిభావమును నేను పరిపోల్చి చూడలేదు. బహుశః అందులోను ఇందులోను ఒకేవిధమైన భావములు ప్రకటింపబడి యుండవచ్చును.

కామతు:- చైనాలో ఏర్పడిన కొత్త కమ్యూనిస్టు ప్రభుత్వమును ఇండియా గవర్నమెంటు పరిగణించవలెనా అను విషయమిప్పుడు చర్చనీయాంశంగా ఉంది. ఇట్టిస్థితిలో చైనాకమ్యూనిస్టు గవర్నమెంటుకు యీ విషయమును ఎరుకపరచెదరా?

ప్రధానమంత్రి:- బహుశః చెయ్యము.

# భారతదేశంలో పాకిస్థాన్ ప్రధాని ఆస్తులు

న్యూఢిల్లి, డిసెంబర్ 6: ఈ వేళ కాందిశీకుల ఆస్తి వ్యవహారాలను గురించి, పార్లమెంటులో వచ్చిన ప్రశ్నలకు సమాధానం చెబుతూ కాందిశీక మంత్రి మోహన్‌లాల్ శాక్సేనా ఈదిగువ వివరాలు తెలియజేశారు.

ఢిల్లీలోనూ, సంయుక్త రాష్ట్రాలలోనూ, పాకిస్థాన్ప్రధాని లియాకతాలీఖానుకు 4 లక్షల రూపాయలు ఖరీదుచేసే ఆస్తులున్నయి. సంయుక్త రాష్ట్రాలలోని ఆస్తులమీద యేటేటా 55000 వేల రూపాయల ఆయివజావస్తుంది. ఢిల్లీలోవున్న ఆస్తులమీద రు 1708 రూపాయలు అయివజావస్తుంది. దేశవిభజన అనంతరం పాకిస్థాన్ ప్రధానికి ఈ ఆయివజులో 85000 రూపాయలు ముట్టింది. రెండుమాసముల క్రితం వరకూ ఆయనకు వెళ్ళవలసిన మొత్తం పెడుతూనే వుంచేది. కాని కేంద్రప్రభుత్వ శాసనం అమల్లోకి వచ్చిన అనంతరం నిలిపివేశాం. హైకమిషనర్ ఉన్నభవనం ఆయన భార్యది. అందుచేత లియాకతాలీఖాన్‌గారి ఆస్తుల జాబితాలో చేర్చలేదు.

ఇక్కడవున్న పాకిస్థాన్ కాందిశీకుల ఆస్తులమీద వచ్చే అద్దెలను పాకిస్థాన్‌లో ఆస్తులువగైరా విడిచి నిరాధారులై వచ్చి వేసిన వితంతువులకూ, వృద్ధులకూ, అవస్థులకూ అలవెన్సులక్రింద ఖర్చు పెడుతున్నాం.

దేశంలో పాకిస్థాన్ వారువిడిచిపోయిన ఆస్తుల వివరాలన్నీ సేకరించుతున్నాం. వివరాలు సమగ్రంగా అందగానే సభవారి ముందు వుంచుతాం.

పాకిస్థాన్ కాందిశీకుల ఆస్తుల అద్దెలమీద దేశం మొత్తంగా యెంత ఆయివజు వస్తుందో ఇప్పుడు తెలియజేయలేము వృద్ధులకూ వితంతువులకూ కూడా ఇంకా యేమీ యివ్వలేదు. 12,000 వేల విజ్ఞప్తులు వచ్చాయి. ఇంకా రావచ్చు. వీలు వెంట పంచుతాం" అన్నారు.

# ఢిల్లీలో దొంగతనాలు

న్యూఢిల్లీ, డిసెంబరు 6:

డిసెంబర్ 6 తే జరిగిన విలేఖరుల గోష్ఠిలో, విలేఖరులు ఢిల్లీలో ప్రజ్వరిల్లుతూన్న దొంగతనాలను గురించీ, దోపిడీ నేరలను గురించీ ప్రధాని నెహ్రూకు తెలియజేశారు. రాత్రి ప్రొద్దుపోయిన అనంతరం సైకిలుమీద ఇళ్ళకుచేరే అకాశం తప్పతోంది. దొంగలు మధ్య త్రోవలో అటకాయించి సైకిళ్లులాక్కుంటున్నారు, అని ఒక విలేఖరి తెలియజేశారు. ఈ విషయమై తగిన శ్రద్ధ తీసుకుంటామని ప్రధాని హామీ యిచ్చారు.

# "నిర్మాణ ప్రణాళికలకు గ్రామ తగాదాలు అంతరాయం కలిగిస్తున్నవి"

## పబ్లిక్‌వర్క్సు మంత్రి భక్తవత్సలంగారి వివరణ

### కృష్ణాజిల్లాలో రెండవపంటకు నీటి సరఫరా విషయమై విజయవాడలో చర్చలు

(స్వకీయ విలేఖరి)

విజయవాడ, డిశంబరు 6: "మురుగునీటి పారుదలకై సరియైన సౌకర్యములు లేని ఫలితముగా వరదలవలన, తుఫానువలన సంభవించునష్టములు ద్విగుణీకృతమగుచున్నవి. ఇంతకుముందు మురుగునీటి పారుదలకై తలపెట్టిన కార్యక్రమమేదియును లేదు. ప్రస్తుతము, ఈ సమస్యను పరిష్కరింప ప్రభుత్వము పూనుకున్నది. ఇర్రిగేషన్ (నీటి సౌకర్యముల) శాఖవారు వేయ సంకల్పించిన బెటర్‌మెంట్ (అభివృద్ధి) పన్నులో డ్రైనేజీ (మురుగునీటిపారుదల) పన్నుకూడా కలసియుండును. కాని గ్రామ ముఠాల తగాదాలవలన, కొన్నికొన్ని నిర్మాణ ప్రణాళికలకు అంతరాయము కలుగుచున్నది" అని మద్రాసు పబ్లిక్‌వర్క్సు మంత్రి యం. భక్తవత్సలంగారు నిన్న సాయంత్రము సబ్‌కలెక్టర్ ఆఫీసులో జరిగిన, అధికార, అనధికార సమావేశములో జరిగిన చర్చలకు ప్రత్యుత్తరముగా చెప్పిరి.

సమావేశములో జిల్లా శాసనసభ్యులు, కాంగ్రెసువారు, రైతులు, ఇంజనీరింగ్ శాఖ, వ్యవసాయ శాఖోద్యోగులు హాజరయిరి. రెండవ పంటకు ప్రభుత్వము నీరు సప్లయి చేయవలెనని, మురుగునీటి పారుదలకు అనువైన ఏర్పాటులను చేయవలెనని, ఇంకనూ అనేక విషయములపై వివిధ వ్యక్తులు, మంత్రిగారికి సవివరముగా సూచన లిచ్చిరి.

కైకలూరు తాలూకాలోని పోతుమర్రు, తాడివడ, కొండూరు, కొల్లపాలెం, దొడ్డిపట్ల, గోపవరం, రామవరం గ్రామములు తమ గ్రామములలో 2618 ఎకరముల వరిపంట ఇంకనూ నీటి క్రిందనే ఉన్నదని, మనుష్యుల ఆహారము నష్టపడిపోగా, గొడ్లకుగూడా ఇంక గడ్డి ఉండదని తెలియజేసిరి. కొల్లేరు ప్రాంతములో, పైకి తేలిన భూములకు రెండవ పంటకై నీటి నివ్వ ప్రయత్నింపవలెనని కోరిరి.

గుడ్లవల్లేరు, ముదినేపల్లి, కానుకొల్లు, మండవల్లి ఫిర్కాలకు సంబంధించిన 38 గ్రామముల వారు, పోలరాజు [మురుగు] కాలువ ప్రతిసంవత్సరము చేయుచున్న భీభత్సమును వివరించుచూ, ఒక వినతిపత్రం సమర్పించిరి. ఈ పోలరాజు కాలువ ప్రతిసంవత్సరము-చందరాలనుంచి కైకలూరువరకు-దాదాపు 40 వేల ఎకరములను ముంచివేయుచుండును. దీనికి మరమ్మతులే జరుగుటలేదు. తుఫాను కాలములో 36 గ్రామములను ఈ కాలువ నష్టపరచినది. ఇక్కడ నాలుగైదు వారములవరకూ పంటలు నీటి అడుగుననే ఉండిపోయినవి. దీనికొక బ్రాంచి కాలువను త్రవ్వి ఆనీరు సముద్రములోనికి పోవుటకు దారిచేయవలెను. పోలరాజు కాలువకు సంబంధించిన ఒక పథకమును ప్రభుత్వము కొన్నిఏండ్ల క్రిందట తయారుచేసినది. కాని అది ఇంతవరకు అమలుజరుగలేదు. పోలరాజు కాలువను అదుపులో నుంచినచో దాదాపు 15 వేల టన్నుల ఆహారము అదనముగా ఉత్పత్తికాగలదు, అంతియేగాని తడవ తడవకు శిస్తు రెమిషన్లనిచ్చి లాభము లేదని విజ్ఞప్తిలో తెలియజేయబడెను.

కొమ్మలేరులో మే 15 వరకు మంచినీరు ఉండునుకాన, ఈ ఏటినీటిని పైకి తోడుకొనుటకై పంపింగ్ యంత్రములను సప్లై చేయవలసినదని, అప్పుడు రెండవ పంటకు నీరులభించునని ఒకరు సూచించిరి.

వైవాక, కొంతంగి, మట్టుపంట, పెనలంక, కలిదిండి కాలవలకు చుట్టుపట్ల భూములు మునిగిపోయెను. కాన, రెండవ పంటకై కాంప్‌బెల్ కాలువకు నీరు సప్లై చేయుట ఉచితమని మంత్రిగారికి విన్నవింపబడెను. వైవాకవద్ద 8000 ఎకరముల బంజరును సాగులోనికి తీసికొనివచ్చుటకు తక్షణమే ప్రభుత్వము పూనుకొనవలెనని కూడా కోరిరి.

గుండేరు పొంగుటవలన, తుఫాను గాలికి బాగుగా నష్టపడని చివితాలూకా భూములు విపరీతంగా నష్టపడినవని, నీటి పారుదలకు ఎన్నిపనులను చేసినప్పటికిని, మురుగునీటి పారుదలకు సౌకర్యములు లేకపోవుచున్నవనీ, పైగా ఈ ఏళ్ళకు, కోళ్ళకు, అనాలోచితముగా ఎత్తులేని వంతెనలు నిర్మింపబడినవనియు, వాటిని ఎత్తు చేయింపవలెననియు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు సూచించిరి.

బకింగ్‌హామ్ కాలువకు కృష్ణనుంచి సప్లై చేయుచున్న నీటిని ఆపుచేసి, కృష్ణాజిల్లా కాలువలకు నీటినివ్వవలెనని, అంతగా అవసరమని తోచినచో మురుగునీటి పారుదల శిస్తునైనా వేసి, మురుగునీటి ప్రమాదమునుంచి భూములను కాపాడు ఏర్పాటులను చేయవలెననియు, దాదాపు ప్రతిసభ్యుడు విజ్ఞప్తిచేసెను.

పోలుకొండవద్ద చంద్రాయిగోడును, డాముసుకట్టుటవలన తమిరిశె భూములకు నష్టము వచ్చుచున్నదనియు, కాని ఆ నిర్మాణమును ముందుగానే పునఃపరిశీలన చేయవలెననియు యం. అంకినీడుగారు సూచింపగా, ఆ నిర్మాణమువలన నూటికి ఇరువదివంతులు ఉత్పత్తి పెరుగును కాన పునఃపరిశీలన అనవసరమని పర్వతనేని బసవశంకరంగారు అనిరి.

కానూరు - యర్లపాలెం (బందరు తాలూకా)వద్ద - జింజేటి కాలువ రు.. సర్కారు కాలువకు ఒక రెగ్యులేటర్‌ను నిర్మించి, ఒక చిన్న కాలువను తీసినచో అచటిస్థితి అభివృద్ధి చెందునని, ప్రస్తుతం తాళ్లపాలెం మొగదలనున్న రెగ్యులేటర్‌ను తీసివేసి తూమును పెట్టవచ్చుననీ, ఆ గ్రామములవారు నివేదించిరి.

కృష్ణలంక రక్షణసంఘమువారు, తక్షణమే విజయవాడవద్ద వరద గట్టును ప్రభుత్వము పూర్వమును తొనివరితిగా నిర్మింపవలెననీ, కృష్ణహద్దులలో రివెట్‌మెంట్‌ను ఈ వేసవిలో కట్టి వేయవలెననీ కోరిరి.

గుడివాడ తాలూకాకు చెందిన తమిరిశె, గుండీపూడి, దండిగనపూడి, పానుమూడు, వెన్నపూడి, తుమ్మలపల్లి గ్రామ ప్రతినిధులు, ఆ గ్రామముల సమీపములో ప్రభుత్వము తలపెట్టిన రెగ్యులేటర్ నిర్మాణమును ఆపుచేయవలెననియు, లేకున్న మురుగునీరు, వాననీరు పోవుమార్గము లేక నష్టము కల్గుననియు తెల్పిరి.

వేముల కూర్మయ్యగారుమాట్లాడుచూ బుడమేరుకు ప్రాజెక్టును కట్టు ఆలోచనను విరమించి, 70 మైళ్లపాటు వరదగట్టును నిర్మింప ప్రభుత్వము తలపెట్టుట చాలా నష్టదాయకమనిరి. ప్రజలకు కావలసినది, బుడమేరు వరదలనుండి శాశ్వతరక్షణ - ఆ నీటిని నిలవజేయు ఏర్పాటుచేసికొని, పంటలకు వినియోగించుట. ఆ పని చేయుటకుబదులు తాత్కాలికపు ఏర్పాటుల క్రింద ధనమును దుబారా చేయరాదు. వ్యయమును పాటింపక, శీఘ్రరమే ఆరు తాలూకాల ప్రజలకు ఈ బుడమేటి బెడదను శాశ్వతముగా తప్పించుటముఖ్యము. ఇంతచేసి ప్రభుత్వము తలపెట్టిన ఈ గట్ల నిర్మాణము వరదలనరికట్టలేదనికూడ కూర్మయ్యగారు తెల్పిరి.

గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు మాట్లాడుచూ, అన్ని ప్రాంతములలోను మురుగునీటి పారుదలకు ఒక సమగ్రపథకమును వేయవలెననిరి. చెరువులకు పూర్తిగా నీటి సప్లయిచేయుట అత్యవసరమని, ఈ ఏడు తప్పక దాళవపంటకు నీటి నివ్వవలెనని విన్నవించిరి.

అడుసుమిల్లి గోపాలకృష్ణయ్య, ప్రభుత్వమువారు చేయదలపెట్టిన సౌకర్యములను డిసెంబర్ మాసాంతములోగానే తెలియజేసిన, ఆ సౌకర్యములను వినియోగించుటకు రైతులు సిద్ధముగా నుండగల్గుదురని సూచించిరి.

విత్తనములు చీకటి బజారులోనికి వెళ్ళినవనియు, వ్యవసాయ శాఖ వారి ద్వారాపకాలములో, ప్రభుత్వము విత్తులను సప్లయి చేయవలెననియు సభ్యులు కోరిరి.

భక్తవత్సలంగారు సమాధానమిచ్చుచూ, బాధితులకు తక్షణమే సహాయము చేయుటకు ప్రభుత్వము దాదాపు ఐదు లక్షలను ఖర్చుపెట్టినదనియు, ఇంకనూ ఇచ్చుటకు సిద్ధముగా నున్నదనియు, తెల్పిరి. ఇంతవరకు మురుగునీటి పారుదలకు సరియైన పథకమేదియూ వేయబడలేదు. ఇంక తప్పక, ప్రభుత్వ మీసౌకర్యములను చేయుపూనుకొనును. ఈ పనికై అవసరపుపన్ను నిచ్చుటకుగూడా తయారుగానున్నట్లు సభ్యులు తెల్పుట ఆనందదాయకముగా నున్నది. కాని ఈ సౌకర్యములవలన లాభపడువారిపైననే పన్నును విధించుట సమంజసము. ఏమైననూ ప్రభుత్వమువిధింప తలపెట్టుచున్న బెటర్‌మెంట్ [అభివృద్ధి] పన్నులో, ఈ పన్ను కూడా కలసియే యుండగలదు. దాళవపంటకు నీటినివ్వవలెనని, బకింగ్‌హామ్ కాలువను మూయవలెనని సభ్యులు సూచించిరి. దాళవపంటకు నీరిచ్చు విషయమై చాలా చర్చ జరిగినది. గోదావరి ప్రాంతములో కొంత నీరిచ్చుటకు వీలైనది. కాని కృష్ణప్రాంతములో, నీరు ఉన్నప్పటికిని, నీటిసప్లయి వీలుకావున్నది. బకింగ్‌హామ్ కాలువను మూయ సాధ్యమగునో కాదో ఆలోచింపవలెను. ఇచట దాదాపు 50 వేల ఎకరములకు దాళవపంటకై నీరు కావలెను. బకింగ్‌హామ్ కాలువను మూసినప్పటికి, ఇంత భూమికి నీరు లభించగలదా? అయిననూ ఈ సూచన విచారింపదగ్గది అనుచూ, మంత్రిగారు చర్చలో పాల్గొనినవారికి కృతజ్ఞత తెలిపిరి. శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు మంత్రిగారికి కృతజ్ఞత తెల్పిరి.

ఉదయము మంత్రిగారు నూజివీడువద్ద రైలులో దిగి, బెజవాడవరకు కారులో వచ్చుచూ, మార్గము ప్రక్కలగల గ్రామములను పరీక్షించిరి. మీర్జాపురం, ఓగిరాల, వేలేరు, వీరపల్లి గ్రామములవద్ద గట్లుతెగిన చెరువులను, నష్టమును పరిశీలించిరి.

వీలేరువద్ద ఒక హృదయవిదారక ఘటన జరిగెను. దోశెట్ల నాగేశ్వరరావు అను ఒక 12 సంవత్సరముల పిల్లవాడు, తుఫానుకాలములో వీలూరులో ఉండెను. ఇచట వీలేరులో తల్లిదండ్రి సహోదరులు అందరునూ తుఫానుకు ఆహుతి అయిపోయిరి. వీరుగాక మరి యిరవై మంది వీలేరు చెరువు నీటిలోపడి మరణించిరి. నాగేశ్వరరావు నిరాశ్రయుడు, దిక్కులేనివాడయ్యెను. మంత్రిగారితో, ఈపిల్లవాడు ఈదుర్ఘటనను, వరదవలె కారుచున్న కన్నీటితో వివరించెను. మంత్రిగారు, నాగేశ్వరరావునుఓదార్చుచూ, ప్రభుత్వ మతనికి తప్పక సహాయము చేయునని చెప్పిరి.

ప్రతిగ్రామములో మంత్రిగారికి, గ్రామస్థులు తమతమ గోడులను వెళ్లబోసుకొనిరి. మంత్రిగారు వారికి సాధ్యమైన సహాయమును చేయగలమని హామీ నిచ్చిరి.

మంత్రిగారితో, విజయవాడ సూపరింటెండింగ్ ఇంజనీర్ జె. ఎ. నరసింహారావు, కాకినాడ హైవేస్ సూపరింటెండింగ్ ఇంజనీర్ యస్. మూరాని, అదిషనల్ చీఫ్ ఇంజనీర్ టి. యస్. వెంకటరామన్, కాకినాడ హైవేస్ డివిజనల్ ఇంజనీర్ సి. కృష్ణారెడ్డి, విజయవాడ హైవేస్ డివిజనల్ ఇంజనీర్ హెచ్. సయాజీరావు, కాకాని వెంకటరత్నం, కొల్లిపర సూరయ్య, నూకల వీరరాఘవయ్య, కృష్ణాకలెక్టర్ పీరీగారలు ఉండిరి.

సాయంత్రము, విజయవాడ విద్యుత్ కేంద్రమును పరిశీలించి పరీక్షించి మంత్రిగారునిన్నరాత్రి మెయిల్‌లో మద్రాసుకు వెళ్ళిరి.

# అనంతపురంజిల్లాలో న్యాయ, కార్యనిర్వాహకశాఖల విభజన

## వచ్చే సంవత్సరం జరిగే సూచన

అనంతపురం, డిసెంబర్ 5: ఈ జిల్లాలో వచ్చే సంవత్సరమునుండి న్యాయశాఖ కార్యనిర్వాహకశాఖలు రెండును విభజింపబడుననీ అప్పుడు ఈ క్రింది విధముగు ఏర్పాట్లు జరుగునని తెలియుచున్నది.

అనంతపురం బళ్లారిజిల్లాలు రెండింటికి కలసి గుత్తిలో ఒక జిల్లా మేజస్ట్రేటు ఆఫీసు ఏర్పడును. అనంతపురం జిల్లాలో ఇప్పుడున్న మూడు రివిన్యూ డివిజనులలో గుత్తి రివిన్యూ డివిజన్ ఎత్తివేసి అనంతపురం డివిజనుకు చేర్చబడును. ప్రకృతము అనంతపురం డివిజనులోనుండు ధర్మవరం తాలూకా పెనుకొండలో కలుపబడును.

ధర్మవరంలో మరియొక మునసబుకోర్టు స్థాపించి, కదిరి తాలూకా చేర్చబడును. తొమ్మిది తాలూకాలకును తొమ్మిదిమంది మేజస్ట్రేటులు పనిచేయుదురు. ఉరవకొండలోని సబ్‌మేజస్ట్రేటు ఆఫీసు చాలవరకు తొలగింపబడును.

జిల్లా కలెక్టరుగారు అడిషనల్ డిస్ట్రిక్టు మేజస్ట్రేటు హోదాలో శాంతిభద్రతల సంరక్షణ కర్తగా నుండగలరని తెలియుచున్నది. (స్వ. వి.)

### అనంతపురం జిల్లానుండి సెనేటు సభ్యులు

అనంతపురం, డిసెంబరు 5: ఈ జిల్లాబోర్డు, అనంతపురం, హిందూపురం, తాడిపత్రి మునిసిపాలిటీలనుండి ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేటుకు ఎన్నుకొబడవలసిన రెండు స్థానములకు ఐదుగురు పోటీచేసిరి. అందులో గౌరా శ్రీరాములు శెట్టి, పి. లక్ష్మన్నగారు గెలిచిరి. ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు సంఘముచే నియమితులైన కె.వి. శ్రీనివాసరెడ్డిగారుఓడిపోయిరి. (స్వ. వి.)

### రాజకీయ బాధితులకు భూవసతి

అనంతపురం, డిసెంబరు 5: ఈ జిల్లాలో భూవసతికొరకై 297 మంది రాజకీయబాధితులిదివరకు దరఖాస్తు చేసికొనగా అందులో 75 మందికి భూములివ్వబడినవి. 28 మందికి నిరాకరింపబడినవి. 194 ఆలోచనలో నున్నవనియు ఇందులో 122 మందికి సత్యాగ్రహము చేసిన సర్టిఫికేట్లు లేవనియు అందువల్లనే ఆలస్యమగుచున్నదనియు తెలసినది. ఇచ్చిన భూములలో 160 ఎకరములు తరి, 1042 ఎకరములు మెట్ట. (స్వ. వి.)

### అనంతపురం జిల్లాలో ఆహారధాన్యస్థితి

అనంతపురం, డిశంబరు 5: ఆహారధాన్యములలో బియ్యము తప్ప గోధుమలు జొన్నలు మొదలగునవి కావలసినన్ని కలవనియు 450 టన్నుల వడ్లు నెల్లూరునుండియు, 140 టన్నుల బియ్యము తెనాలినుండియు త్వరలోనే దిగుమతి యగుననియు ఇవిగాక 1100 టన్నుల బియ్యము కేంద్ర ప్రభుత్వమువారిచే ప్రత్యేకించబడెననీ యివి కొచ్చినుండి వచ్చుననియు జిల్లా కలెక్టరు వివేకానందమూర్తిగారు నేడు ఉదయం తెలియపరచిరి. ఇవిగాక 100 టన్నుల మైదామైలో మొదలగునవి కలవనిరి. ధాన్యపు కొనుగోలు ధరలు 4-12-49 నుండి తగ్గింపబడినవి గాని ఇప్పుడు నిలువయుండు సరకులు ప్రకృతపుధరలకే అమ్మబడునని తెలిపిరి. (స్వ. వి.)

### అనంతపురం భగవద్గీతా సమితి

అనంతపురం, డిసెంబర్ 2: స్థానిక శ్రీ భగవద్గీతా సమితివారు నిన్న సాయంత్రం శ్రీ కాశీ విశ్వేశ్వర రామాలయమునందు గీతా జయంత్యుత్సవమును జరిపిరి. జిల్లాకలెక్టర్ సి. వివేకానందమూర్తిగారు అధ్యక్షతవహించిరి. ఈ సంవత్సరం జరిపిన గీతా పోటీపరీక్షయందు ఉత్తీర్ణులయిన ఏడుగురు విద్యార్థులకు బహుమతులివ్వబడినవి. గీతా ప్రాశస్త్యమును, గీతా సందేశమునుగురించి మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ డాక్టర్ చిలుకూరు నారాయణరావుగారు, రిటైర్డు ప్రొఫెసర్ యం. ఛాయప్పగారు విపులముగా ఉపన్యసించిరి. సంఘములో సహకార సౌభ్రాతృత్వమును, మానవజీవితమునందు ధర్మప్రాధాన్యము కలిగియుండుటయే గీతయొక్క ముఖ్యోద్దేశ్యమని అధ్యక్షులు చెప్పిరి. కార్యదర్శి గోళ్ళపల్లి వెంకటనరసయ్యగారి వందనసమర్పణలతో సభ ముగిసెను.

# బళ్లారిలో రాఘవస్మారక నాటకశాల

## మద్రాసు ప్రధాన న్యాయమూర్తి రాజమన్నారుగారిచే శంకుస్థాపన

బళ్ళారి, డిసెంబరు 4: ఆంధ్రనాటకరంగస్థలమునందే కాక ఖండాంతరములందు కూడ ఖ్యాతినందుకొనిన స్వర్గీయ తాడిపత్రి రాఘవాచార్యులుగారి స్మారక నాటకశాలకు నిన్న ఇచ్చట శంకుస్థాపన కావించుచు, మద్రాసుహైకోర్టు ప్రధాన న్యాయమూర్తి పి. వి. రాజమన్నారుగారు నాట్యకళాప్రపూర్ణుని అమోఘభావ ప్రకటనాచాతుర్యములు కొనియాడుచు నాటక కళకు వారొనరించిన సేవ అసమానమని నిరూపించుచు, ఇట్టివారికి పెక్కు స్మారక చిహ్నములుండవలెననియు, యిందుకు తమ శక్తికొలది సహకరింతుమనియు చెప్పిరి. ఈ సందర్భమున జరిగిన సభకు రెవెన్యూమంత్రి సీతారామరెడ్డిగారు అధ్యక్షత వహించిరి.

స్మారకసంఘ కార్యదర్శి యం. ఛాయప్పగారు గవర్నరు జనరలు రాజగోపాలాచారిగారు, డి. వి. సుబ్బారావు (బందరు), కామేశ్వరమ్మ (మైసూరు) గారలు పంపిన సందేశములు చదివిరి.

నివేదికను చదువుచు, ప్రభుత్వమువారు 1/3 ఎకరం స్థలము ఉచితముగా నిచ్చిరనియు, ఇంతవరకు నాటకశాల భవననిధికి 10,000 పైన సమకూడినదనియు, పుస్తకభండాగారమును కూడ పెట్టెదమనియు ఛాయప్పగారు వివరించిరి.

సీతారామ రెడ్డిగారు, ఇంగ్లీషులో సభనుద్దేశించుచు, తమ కళాదృష్టికి నూతనత్వము నాపాదించినది రాఘవాచారిగారనియు, రాజమన్నారుగారికి ఆచారిగారు వ్రాసినలేఖావళిసారస్వత పుష్పములనియు వీటిని అచ్చొత్తింప వలెననియు సూచించిరి. యువజనులు ఆచార్యులవారి కళావర్చస్సులను పాటింతురని ఆశించిరి.

పిమ్మట రాజమన్నారుగారు మంగళతూర్యములు, వేదపఠనల మధ్య నాటకశాలకు శంకుస్థాపన కావించిరి. రాజమన్నారుగారు ఉపన్యసించుచు యిట్లనిరి.

"ఈ సమయం నిజంగా, ఆనందానికి గర్వానికి కారణమైనది. నా మొదటిభావం దుఃఖంతో మిళితంగావుంది. నేను 3 ఏండ్ల క్రింద బళ్ళారికి వచ్చినప్పుడు పూవు అలా నేవున్నా, అప్పటి మనుష్యులేవున్నా ఒక ముఖ్యజీవం, క్రిందటిసారి రాఘవుడున్నాడు, ఈ సారిలేదు.

రాఘవునితో నాకు పరిచయం 1922 23 లో కలిగింది. అనతి కాలంలో స్నేహంగా పరిణమించి ప్రేమగావృద్ధి చెందింది. ఆయన లేకపోయినా అది అలానేవుండిపోయింది, ఆయనవ్రాసినపుత్తరాలు చాలా వున్నయి. అవి నాకు స్మారకచిహ్నాలు. నాసారస్వతజీవితంలో వారుగొప్పజ్యోతి. అనేకవిధముల మార్గదర్శకాలు! నాటకాలు నాచేరచయింపజేసిన సుగుణశ్రేష్ఠుడు "తప్పెవరిది"వ్రాయించింది ఆయనే దానికి జీవంపోసి, రాణింపజేసిందీ. ఆయనే.

"కేసు విషయాలలో సలహాకోసరం వచ్చినా, నాటకం సంగతే ఎక్కువమాట్లాడేవాళ్ళం. నేను రాఘవునితో గడిపినకాలం ఎప్పుడూ వ్యర్థంగా పోలేదు. అని అన్నారు. 1946 లో ఆచార్యులుగా రాడిన "తెగని సమస్య" (రాజమన్నారు విరచితం) ఇదే రాజమన్నారుగారికి ఆచార్యులు చూపిన ఆఖరు ప్రదర్శనం. రాఘవుని ఇచ్చట పొగడుట పుట్టినింటిగొప్ప మేనమామదగ్గర చెప్పినట్లు "ఒక బళ్లారి జిల్లాకాదు దేశమేకాదు. వారు ప్రపంచ నటులలో అగ్రగణ్య స్థానం పొందదగిన మహనీయుడు రాఘవాచారి. సామాన్యరానిలో చెప్పాలంటే, గొప్ప తనంలో మైమెట్టు కళలో, సంగీతం, సాహిత్యముల్లోఅగ్రస్థానమని చెప్పవచ్చు. ఆచార్యులుగారి పాత్రధారణలో మహత్తర విశేషం, నటనలో సృష్టి. అంశము జేడిద; నాటకకర్త పాత్రని, పునస్సృష్టి చేసేవారు-కళఅనే మాసపత్రికలో దాన్ని గురించి వ్యాసంకూడా వ్రాశాను. రాక్షసుడు, క్రూరుడు, అని సాధారణంగా అనుకుంటాం కాని, గొప్ప నిష్ఠాగరిష్ఠుడు. ఒక అహంకార భావంవలన ఇట్లయినా దేవాదిని ప్రహ్లాదుని మీదకంటేకూడ హిరణ్యకశిపునిమీద ఎక్కువ జాలి పుట్టేటట్లు ఆయన నటించేవాడు. షేక్స్‌పియర్ విషాదాంత నాటకాలలో నాయకునిపాత్ర అభివృద్ధి చేశాడు. కాని మనకు ఆ నాయకునిపట్ల జాలి, సానుభూతి కలుగుతుంది. ఇది రాఘవుడు తీసుకొనివచ్చిన విప్లవం" అని రాజమన్నారు అన్నారు.

రాఘవునికి వివిధ భావముల్లో, సమాన నటనా చాతుర్యముండనియు, సాంఘికలోపాలు సంఘర్షణలు నిరూపించే నాటకాలు. వ్రాయటంలో, స్త్రీ పాత్రలను స్త్రీలే వేయవలెననే పట్టుదలలో, ఆచార్యులవారు ప్రపంచము తాంబూలమున కర్తలనియు, రాజమన్నార్ అన్నారు. "ఆధునిక ప్రాయమైన, నాటకశాల నిర్మించాలని ఆయన కోరిక, అది ఆయన జీవితకాలంలో నెరవేరలేదు. అది మన దురదృష్టము. యిలాంటి స్మారకచిహ్నాలు దేశమంతటా నుండవలెను. ఈ స్మారకచిహ్నం బళ్ళారిలో మొదట నిర్మించబడటం సంతోషంగావుంది. ఆంధ్రనాకానికి బళ్ళారితో సంబంధం కృష్ణమాచార్యులగారి నాటకశాలనుండి వచ్చింది. యీశాలనిర్మాణానంతరం, మరల బళ్ళారి గొప్పదనవు వస్తుందని నా విశ్వాసము. నా శక్త్యానుసారం నేను సహాయము జేస్తాను. నా చందాకూడ నేను సమర్పిస్తున్నాను అని రాజమన్నార్ అన్నారు.

సంజీవమూర్తి, యస్. యస్. రామస్వామిగార్లు తెలుగులోను కన్నడములో పొడ్డణ గౌడుగార్లు రాఘవ స్మారక గీతములను పాడిరి. ఛాయప్పగారి, వందనార్పణలతో, మహోత్సవము ముగిసెను.

# రజకవిద్యార్థి పాఠశాలలో గాంధీవిగ్రహప్రతిష్ఠ

విజయవాడ, డిసెంబరు 4: నేటి ఉదయం 9 గంటలకు విజయవాడలో సురటి దుర్గారావుగారిచే స్థాపించబడిన ఆంధ్రరాష్ట్ర బీదరజక విద్యార్థి పాఠశాల వసతిగృహములో మహాత్మాగాంధీ శిలావిగ్రహ ప్రతిష్ఠాపన మద్రాసు ప్రభుత్వ మద్యనిషేధశాఖామాత్యులు గౌ॥ నీలం సంజీవరెడ్డిగారిచే జరుపబడెను.

మంత్రి సంజీవరెడ్డిగారు అధ్యక్షోపన్యాసములో రజకులలో అవిద్యావంతులు చాలామంది ఉన్నారనీ, అట్టివారి విద్యాభివృద్ధులకై యిటువంటి సంస్థలు జిల్లాకు కనీసం ఒకటైనా స్థాపించవలెనని, ఆనాడే రజకులలో ఐక్యత ఏర్పడునని, జరకుల విద్యావసతులకై శాయశక్తుల సహాయము చేసెదనని, ఉపన్యసించిరి.

## గంటల పంచాంగం

విరోధి సం॥ మార్గశిర బ॥ తదియ 1949 సం॥ డిసెంబరు 8 గురువారం శు॥ తదియ రా 10-44 పున 24-0 వర్జ్యం సా 6-4ల 7-43 వ.

బ॥ చవితి డిసెంబరు 9 శుక్రవారం శు॥ చవితి రా 10-36 పున శు 6-27 వర్జ్యం ప 2-33 ల 4-11 వ.

ఆంధ్రపత్రిక

విరో॥ సం॥ మార్గశిర బ॥ తదియ గురు వా ర ం.

## ఆంధ్రరాష్ట్రస్థాపన: మంత్రివర్గ ధోరణి

ఆంధ్రరాష్ట్ర నిర్మాణముప్రస్తుతము అమలునందున్న 1935 వ సంవత్సరపు భారతప్రభుత్వ చట్టమును అనుసరించి 1950 జనవరి 26 లోపున గాక నూత్న రాజ్యాంగములోని మూడవ సెక్షన్‌ను అనుసరించి 1950 జనవరి 26 అనంతరము మాత్రమే ఏర్పడగలదని దాదాపు స్థిరపడిపోయినట్లే భావింపవచ్చును. 1950 జనవరి 26 వ తేదీనాటికి గాక, ఏప్రెల్ 1 వ తేదీ నాటికి ఆంధ్రరాష్ట్రస్థాపనకు వీలుగా అన్ని ప్రయత్నములను చేయవచ్చునని, జనవరి 26 లోపున భారతప్రభుత్వ హోము శాఖ వారు పేర్కొనిన సమస్యలన్నిటి పరిష్కారము అసాధ్యమని చెన్న రాష్ట్రమంత్రివర్గము చేసిన నిర్ణయము కాంగ్రెసు కార్యవర్గము నవంబరు 16 వ తేదీన ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమును గురించి చేసిన తీర్మానతత్వమునకు విరుద్ధముగ లేకున్నను, భిన్నముగ నున్నది "కేంద్రప్రభుత్వము నిర్వివాదమైన ఆంధ్రప్రాంతముతో, చెన్ననగరమును వదలి ఆంధ్ర రాష్ట్రమును ఏర్పరచుటకు తక్షణము చర్యలు తీసుకొనవలెను" అని కార్యవర్గ తీర్మానము సిఫార్సుచేయుటతో తృప్తి చెందక, "ఈ చర్యలు నూత్న రాజ్యాంగమునందలి షెడ్యూలులో ఆంధ్ర రాష్ట్రమును చేర్చుటను సాధ్యము చేయును" అను కార్యవర్గ విశ్వాసమును కూడ ఆ తీర్మానము ప్రకటించెను. నాయకత్రయసూచనలుగాని, కాంగ్రెస్ కార్యవర్గ తీర్మానములుగాని ఆంధ్రరాష్ట్ర నిర్మాణము 1935 వ సంవత్సరపు భారతప్రభుత్వచట్టమును అనుసరించియే జరుగవలెనను ఉద్దేశ్యముతో చేయబడినవని అంగీకరింపకతప్పదు. నూత్న రాజ్యాంగమునందలి షెడ్యూలులో 'ఆంధ్ర'ను పేర్కొనవలెనని కాంగ్రెసు కార్యవర్గము నవంబరు 16 తీర్మానమునందు ధ్వనిగ సూచించినపుడు కార్యవర్గసభ్యులు సాధ్యాసాధ్యముల విచారించియుండరని భావించుటకు వీలులేదు. పూర్వాపరములన్నింటిని పరిశీలించిన మీదటనే నూత్న రాజ్యాంగము నందలి మొదటి షెడ్యూలులో ఆంధ్రను పేర్కొనుటకు వీలుగ కేంద్ర ప్రభుత్వము శీఘ్రచర్యలు తీసుకొనవలెనని కార్యవర్గము సూచించెను.

షెడ్యూలులో చేర్చుటకు రాజ్యాంగరచనా సంఘమునకుగల అభ్యంతరములు అంత సహేతుకముగ కన్పించుటలేదు. నూత్న రాజ్యాంగము అమలుజరుగుటతో బాటు, ఆంధ్రరాష్ట్రము అవతరింపవలెనన్న రాష్ట్రముల జాబితాలో కేవలము పేరు నమోదు చేయుట చాలదని రాజ్యాంగ రచనాసంఘము వారభిప్రాయపడిరి. కాని 1935 వ సంవత్సరము చట్టములో సింధు, ఒరిస్సాలను చేర్చి, అనంతరము ఆ చట్టము ప్రకారమే రాష్ట్రములను స్థాపించుట జరిగినది. రాజ్యాంగము అమలుజరుగుటతో బాటు రాష్ట్రమవతరింపవలెనన్న ముందుగనే రాష్ట్రనిర్మాణము పూర్తికావలసి యుండవచ్చునుగాని రాజ్యాంగ శాసనము ఆమోదింపబడిననాటికి ఆంధ్రరాష్ట్రము రూపొందినగాని జాబితాలో పేర్కొనుట సాధ్యముగాదని రాజ్యాంగ రచనా సంఘమైనను అభిప్రాయపడియుండలేదు. కనుక రాష్ట్రముల జాబితాలో ఆంధ్రను పేర్కొనుటకు కేంద్ర ప్రభుత్వ హోం శాఖా కార్యదర్శి సూచించిన తతంగ మంతయు పూర్తి కానవసరము లేదని స్పష్టమగుచున్నది. నవంబరు 26 న నూత్న రాజ్యాంగము ఆమోదింపబడినపుడు రాష్ట్రముల జాబితాలో ఆంధ్రను పేర్కొనియుండిన జనవరి 26 నాటికిగాని, ఆ తరువాతగాని ఆంధ్ర రాష్ట్రస్థాపనకలాపమును ముగింపవచ్చును. శాసనరీత్యా ఆంధ్ర రాష్ట్ర స్థాపన జరిగిన రాజ్యాంగ శాసనమునందు ఆంధ్రను ప్రత్యేక రాష్ట్రముగనే పేర్కొనవచ్చును. రాజ్యాంగము అమలు జరుగుటతో బాటు, ఆంధ్ర రాష్ట్రమునకు భౌతిక స్వరూప మేర్పడియుండెడిది. ఇటీవలి సంఘటనలనుబట్టి గతములో ప్రభుత్వ ప్రతినిధులు రాజ్యాంగ రచనాసంఘసభ్యులు కూడ నూత్న రాజ్యాంగముతో బాటు ఆంధ్రరాష్ట్రావతరణ కారాదను భావముతోనే రాష్ట్రముల జాబితాయందు ఆంధ్రను పేర్కొనుటకు కూడ అభ్యంతరములు తెలిపియుందురని భావింపవలసి వచ్చును. లేక 1950 జనవరి 26 నాటికి ఆంధ్రరాష్ట్ర నిర్మాణకలాపము పూర్తిగాదని రాజ్యాంగ రచనాసంఘము 1948 ఫిబ్రవరి లోను, నాయకత్రయ సంఘము 1949 ఏప్రిలులోనే గ్రహించియుండవచ్చును.

గత సంఘటనలకు కారణము లేమైయున్నను ఫలితము ఆంధ్ర రాష్ట్ర మేర్పడుట జరిగిన అది నూత్న రాజ్యాంగమును అనుసరించియే జరుగవలసియుండునని చెన్న రాష్ట్రమంత్రివర్గము నిర్ణయించినది. కేంద్రప్రభుత్వము ఈ సూచనను అంగీకరింపక 1950 జనవరి 26 లోపున ఆంధ్ర రాష్ట్రనిర్మాణమునకు అవసరమైన యావత్తు చర్యలు తీసుకొనమని రాష్ట్రప్రభుత్వమును ఆదేశించునని ఆశించుట కెట్టి ఆధారములును లేవు. 1950 ఏప్రిల్ 1 వ తేదీన ఆంధ్రరాష్ట్ర మేర్పడవలెనన్నను కేంద్రప్రభుత్వము హోముశాఖవారు వివరించిన విషయము లన్నియు మార్చి 1 వ తేదీకి పూర్తికావలసియుండును; అప్పటికి పార్లమెంటు ఆంధ్రరాష్ట్రస్థాపన శాసనము కూడ సిద్ధము కావలెను. వీటన్నింటినిబట్టి రాష్ట్రమంత్రివర్గము నియమించు సంఘము రాష్ట్రనిర్మాణమునకు సంబంధించిన యావత్తు వివరములు జనవరి మాసాంతమునకైనను పూర్తికావలెను. కాని మంత్రివర్గనిర్ణయమును పత్రికా విలేఖరులకు వివరించుచు మంత్రి భక్తవత్సలంగారు సరిహద్దు సంఘమునుగూర్చి విశేషముగ చెప్పిరి. భారతప్రభుత్వ హోంశాఖా కార్యదర్శి లేఖలోకూడ ఈ విషయమునకు హెచ్చు ప్రాధాన్య మివ్వబడెను. వీరుభయులుకూడ కాంగ్రెస్ కార్యవర్గము నవంబరు 16 వ తేదీ తీర్మానమునందలి సరిహద్దు సంఘ ప్రసక్తికి లేని అర్థమును కల్పించుచున్నట్లు తోచుచున్నది. నాయకత్రయ నివేదిక ప్రకారము రాష్ట్రనిర్మాణము జరుగవలెనన్న నిర్వివాద ప్రాంతములతో ఆంధ్ర రాష్ట్ర మేర్పడవలసియున్నది. ఈ విషయమును కార్యవర్గము నవంబరు 16 వ తేదీ తీర్మానమున 'పేర్కొని సరిహద్దుల' నిరూపణకు - నిర్ణయమునకుగాదు- ఒక సరిహద్దుకమిషన్ ఏర్పడవలసియుండునని సూచించెను. ఈ నిరూపణ ఆంధ్ర-ఉత్కళ సరిహద్దునగాదు. ఆంధ్ర-తమిళ సరిహద్దు, బళ్లారిజిల్లాలోని మూడు తాలూకాలకు, మిగత ప్రాంతమునకును మధ్య సరిహద్దుల నిరూపణకే ఈ సరిహద్దు కమిషన్ నిరూపక మవసరము.

ఆంధ్ర, తమిళ కాంగ్రెసుసంఘములు ఆంధ్రరాష్ట్ర నిర్మాణము విషయముననే గాక, ఆంధ్రరాష్ట్ర మేయేప్రాంతములతో ఏర్పడవలెనను విషయమునకూడ ఏకాభిప్రాయమును ప్రకటించియుండెను. కనుక 'అవసర ఆంధ్రరాష్ట్రనిర్మాణము' సందర్భమున ఆంధ్రతమిళ సరిహద్దుల నిర్ణయసమస్య ఏర్పడదు. ఉభయులు సమ్మతించిన సరిహద్దు నిరూపణమాత్రమే పరిపాలనావసరమునకు జరుగవలసియుండును. ఇట్టి నిరూపణకు ఎంతో కాలము పట్టదు గనుకనే కాంగ్రెసు కార్యవర్గము నవంబరు 16 వ తేదీనకూడ జనవరి 26 లోపున ఆంధ్రరాష్ట్రస్థాపన సాధ్యమని ఆశించకలిగినది.

చెన్నరాష్ట్రప్రభుత్వము సరిహద్దుల నిరూపణను, సరిహద్దుల నిర్ణయముగ భావించి, సరిహద్దు సంఘమునందు చెన్న రాష్ట్రము, ఒరిస్సా రాష్ట్రములకు చెందనివారి నెవరినైన నియమింపవలెనని సూచించుట జరిగినది. కాని సరిహద్దుల స్థిర నిర్ణయమె జరుగవలెనన్న ఇందు కర్ణాటక, బొంబాయి ప్రాంతముల వారును ఉండుటకు వీలులేదు ఇదే ధోరణిలో చెన్న రాష్ట్రమంత్రివర్గము, మంత్రివర్గ మేర్పరచిన సంఘము వ్యవహరించిన ఏ వివాదములను నాయకత్రయ సంఘము, కాంగ్రెస్ కార్యవర్గము, కేంద్రప్రభుత్వము నివారింప నుద్యమించెనో అవి ప్రత్యక్షమగును. తత్ఫలితముగ రాష్ట్రనిర్మాణమునకే ప్రతిబంధకము లేర్పడవచ్చును.

సరిహద్దుల నిర్ణయసంఘ నియామకము పరిస్థితులు శాంతించిన అనంతరము జరుగవలెనని కేంద్ర ప్రభుత్వాభిప్రాయము కనుకనే ఆంధ్ర-ఉత్కళ సరిహద్దు మార్పు సమస్యను ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘము రాష్ట్రనిర్మాణసందర్భమున పేర్కొనలేదు. ఈ విషయమును మంత్రివర్గము గ్రహింపవలసియుండును.

### రిపబ్లిక్ అవతరణోత్సవం

బొంబాయి, డిసెంబరు 7 :—1950 జనవరి 26 వ తేదీన రాష్ట్ర ప్రభుత్వాలన్నీ భారత రిపబ్లిక్ ఆవిర్భావోత్సవాన్ని నిరాడంబరంగా జరుపుతవి. సాధువుగా ఉండవలసియున్నది. కనుక ఉత్సవాలకై అనవసర ఖర్చులేవీ పెట్టరాదని భారత ప్రభుత్వం... భారత ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలను నిర్దేశించినట్లు తెలుస్తున్నది. యు (స్వే)

# ఐక్య ఇండొనీషియాకు అధికారప్రదానపు బిల్లు

## డచ్చిపార్లమెంటులో చర్చప్రారంభం

హేగ్, డిసెంబరు 6: ఇండొనీషియా స్వాతంత్ర్య ప్రదానపు బిల్లుపై డచ్చి పార్లమెంటు దిగువ సభలో ఈ వేళ ఆపరాహ్ణం చర్చ ప్రారంభమైంది. సభా భవనం ప్రేక్షకులతోను, సభ్యులతోను కిక్కిరిసి పోయింది.

కొంతమంది ఇండొనీషియన్లు సభాభవనం వెలుపల గుమికూడి ప్రదర్శనలు జరపగా పోలీసులు వచ్చి వారిని చెదరగొట్టిరి. ఆంబన్ టిమోర్ అల్ప సంఖ్యాక వర్గాలకు రాయబారులతో తగినంత ప్రాధాన్యమివ్వ లేదన్న హేగ్‌తో ఇండొనీషియన్లు ఈ ప్రదర్శనలు జరిపిరి. సభాంగణంలో రేడియో వ్యాఖ్యాతలు అనువైన స్థలాలలో కూర్చొని సభా కార్యక్రమాన్ని రికార్డు తీసిరి.

7 కోట్ల 50 లక్షల మంది ఇండొనీషియన్లకు అధికారప్రదానంచేసే చారిత్రాత్మకమైన బిల్లు ఇది. బిల్లుమీద ఆంటీ రివల్యూషనరీపార్టీ నాయకుడైన జాన్ షెటిన్ చర్చను ఉపక్రమిస్తూ, అధికార ప్రదానం ఆదరాబాదరగా గాకుండా ఒకనిర్ణీతకార్యక్రమం ప్రకారం సాఫీగా జరగాలనేది అందరూ అంగీకరించిన విషయమనీ, కాని నెదర్లాండ్సు ప్రభుత్వం దీనికి పూర్తిగా వ్యతిరేకంగా వ్యవహరిస్తున్నదని అన్నాడు. "నూతన వ్యవస్థ ఏర్పాటవుతున్న సూచనే ఎక్కడా కనిపించడం లేదు. అదిగాక ఈ బిల్లు నెదర్లాండ్సు రాజ్యాంగంతో పూర్తిగా విరోధిస్తున్నది. నెదర్లాండ్సు ఇండొనీషియాను కలుపుకొని నెదర్లాండ్సు ఇండొనీషియా యూనియన్‌గా రూపొందుతుందనీ ఈ యూనియన్ ఎప్పటివలెనే సామ్రాజ్యంగా ఉంటుందనీ, మొదట చెప్పారు; కాని ఇప్పుడు యీ బిల్లులో ఆ ఆలోచన ఏమియుండేటూడా జాడ తెలియడం లేదు. ఇండొనీషియా నెదర్లాండ్సులమధ్యబంధం దృఢంగా ఉండాలా లేక తెగిపోగా ఉండాలా అన్న విషయమై హేగ్ రౌండు టేబుల్ సమావేశంలో తీవ్రంగా తర్జనభర్జనలు జరిగినవి. ఇంత వివాదపడ్డా చివరకు ఈ బంధం గడ్డిపోచంత గట్టిగాకూడా ఉండదని ఈబిల్లువల్ల తేలుతున్నది. ఆంబన్ టిమోర్, మనిహాసాల విషయంలో స్వయం నిర్ణయాధికారానికి భంగం కలిగింతుకు, ఇండొనీషియాలోనూ ఇక్కడా చాలా ఆందోళన హేతువులయింది."

డచ్చి ఉద్యోగులను ఒకచోటినుంచి ఇంకొచోటికి సరుకు మార్చినట్లుగా డచ్చి ప్రభుత్వపు కొలువులోంచి ఇండొనీషియా ప్రభుత్వపు కొలువులోకి మార్చారనీ, భవిష్యత్తు విషయమై వారికి తగిన హామీలు కల్పించాలని జాన్ షెటిన్ అన్నాడు.

ఈ ఆంటీ రివల్యూషనరీపార్టీ బిల్లును బలపరచదని షెటిన్ చెప్పెను. ఈ పార్టీకి చెందిన సభ్యులు పార్లమెంటులో 13 గురు ఉన్నారు. అనంతరం, స్వతంత్ర కాథోలిక్ సభ్యుడైన సి. జె. ఎమ్. వెల్టర్ మాట్లాడుతూ, ఈ బిల్లు పూర్తిగా రాజ్యాంగ విరుద్ధమని అన్నాడు.

రిపబ్లికన్లు డచ్చివారికి ప్రతికూలురన్నది ప్రసిద్ధమనీ, ప్రధాని హట్టా మాస్కో ప్రభుత్వపు ఏజెంటుఅనీ, టిటో కమ్యూనిస్టు ముఠావాడనీ అనేక ఏళ్ళుగా లోకం అంతా ఎరుగుననీ, ఆయన చెప్పెను. హేగ్ రౌండు టేబుల్ సమావేశం డచ్చి ప్రభుత్వానికి పరాజయ పరంపరగా పరిణమించిందని, ఆయన విమర్శించెను.

నెదర్లాండ్సుయెడ బ్రిటన్ మొదట్నుంచీ చాలా విరోధమైఖరి ప్రదర్శిస్తు వచ్చిందనీ, నెదర్లాండ్సు బలంగా ఉండడం రష్యా అమెరికాలకు గిట్టలేదనీ, అమెరికా ఒత్తిడివల్ల తాము ఈ పని చేయవలసివచ్చిందన్న విషయం కడుపులో దాచడానికి ప్రయత్నించక రహస్యం బైటపెడితేనే హృదయభారం తీరి ప్రభుత్వానికి ఉపశమనగా ఉంటుందనీ, ఆయన సూచించెను. ఈ అపసవ్యమైన నిర్ణయానికి ప్రభుత్వం వహించవలసిన బాధ్యతకూడా ఇట్లాచేస్తే కొంతవరకు తగ్గగలదు, అని వెల్టర్ అనెను.

సమావేశం అప్పటికి అంతటితో ముగిసింది; చర్చ కొనసాగించడానికి సభ రాత్రి పునస్సమావేశం అవుతుంది.

### రిపబ్లికన్ పార్లమెంటు సమావేశం

జోగ్జకర్తా, డిసెంబరు 6: ఈ వేళ ఇక్కడ ప్రారంభమైన రిపబ్లికన్ పార్లమెంటు సమావేశంలో నెదర్లాండ్సు ప్రధాని డా॥ మహమ్మద్‌హట్టా హేగ్ ఒడంబడికను సమీక్షిస్తూ ఈ విధంగా ఉపన్యసించెను:- "నెదర్లాండ్సు - ఇండొనీషియా యూనియన్ ఉభయదేశాల సహకారానికి సంకేతప్రాయంగా ఉంటుంది. డచ్చి న్యూగినీ కొంతకాలం అయిన తర్వాత రిపబ్లిక్‌లో అంతర్భాగం అవుతుందనటంలో సంశయంలేదు. విదేశీ పెట్టుబడుదారులు భావిప్రభుత్వాల సాంఘిక కార్మిక విధానాలకు లోబడిఉండదల్చుకుంటే ఉండవచ్చును. ఒడంబడికను పార్లమెంటు త్వరగా ఆమోదించవలెనని విజ్ఞప్తి చేస్తున్నాను." తాత్కాలికాధ్యక్షుడు డా॥ సోకర్నో ఉపన్యసిస్తూ, హేగ్ ఒడంబడిక దేశాన్ని తనలక్ష్యం దగ్గరికి చేర్చగలదనీ, ఈ ఒడంబడికను నిరాకరిస్తే భవిష్యత్తు ఎలా ఉంటుందో తాను చెప్పజాలననీ అన్నాడు.

పార్లమెంటు ప్రస్తుత సమావేశం వారం రోజులపాటు సాగుతుందనీ, ఒడంబడిక మీద వోటింగు సోమవారంనాడు జరగవచ్చుననీ అనుకొనుచున్నారు.

నూతన రిపబ్లిక్ అధ్యక్షుణ్ణి డిసెంబరు 15 వ తేదీన ఎన్నుకొనవలెనని ఇంతకుముందు అధికార స్వీకరణ సంఘం నిర్ణయించింది. కొత్త పార్లమెంటు తాలూకు 150 మంది సభ్యుల ఎన్నికకూడా ఆ తేదీలోగానే పూర్తి అవుతుంది. అధికార ప్రదానం జరిగేనాటివరకు ఇండొనీషియాలో శాంతి భద్రతల రక్షణ బాధ్యతను వహించవలసింది పేరుకు డచ్చివారే అయినా, ఆచరణరీత్యా నేటినుంచీ జోగ్జకర్తా సుల్తానే ఆ బాధ్యతను వహిస్తున్నాడు.

## నైర్‌ఋతి ఆఫ్రికా ప్రతిపత్తి

(1-వ పేజీ తరువాయి)

అంతకుముందే ఒక తీర్మానం చేసింది. నైర్‌ఋతి ఆఫ్రికాను సమితి ధర్మకర్తృత్వానికి అప్పగించవలసిందనీ, యీలోగా నైర్‌ఋతి ఆఫ్రికా పరిపాలన విషయమై వార్షిక నివేదికలను యథాప్రకారం అందజేస్తూ ఉండవలసిందనీ, ఈ తీర్మానంలో పునరుద్ఘాటించబడెను. ద. ఆఫ్రికా లోగడచేసిన వాగ్దానాన్ని ఉపసంహరించినందుకు విచారం వెలిబుచ్చుతూ తీర్మానంలో ఉన్న క్లాజుమీద వోటింగు జరిగినప్పుడు బ్రిటన్ తటస్థంగా ఊరుకున్నది. ఈ క్లాజు 33 వోట్లతో ఆమోదించబడెను. తీర్మానానికి వ్యతిరేకంగా 9 వోట్లు వచ్చినవి. పది రాజ్యాలు తటస్థంగా ఊరుకున్నవి.

నైర్‌ఋతి ఆఫ్రికాను సమితి ధర్మకర్తృత్వానికి అప్పగించవలసిందని ద. ఆఫ్రికాను ఆదేశిస్తూ సమితి లోగడ చేసిన తీర్మానాలను పునరుద్ఘాటిస్తూ ఉన్న భాగం 29 వోట్లతో ఆమోదించబడెను. 12 మంది ప్రతికూలించిరి; 11 మంది తాటస్థ్యం వహించిరి.

ఈ తీర్మానమును ఇండియా-గోడిమాలాలు కలిసి ప్రతిపాదించినవి.

### జూస్ట్ వాదం

ధర్మకర్తృత్వ సంఘం రెవరెండ్ మైఖేల్ స్కాట్ సాక్ష్యమును వినడం అనుచితమని ఖండించ వలసినదిగా దక్షిణ ఆఫ్రికా ప్రతినిధి జనరల్ అసెంబ్లీని ఈ వేళ కోరెను. యోగ్యతార్హత లేమిటో విచారించకుండా ఒక వ్యక్తిని ఈవిధంగా సభలో మాట్లాడనివ్వడం న్యాయవిరుద్ధం అనడమేగాక ఐక్యరాజ్యసమితికి వినాశహేతువుగా పరిణమించగలదని చెప్పెను. సమితి ఎదుటనున్న తీర్మానాలు దక్షిణ ఆఫ్రికాకు అన్యాయం చేస్తున్నవనీ, దక్షిణ ఆఫ్రికాకు సుముఖంగా ఉన్న అంశాల మాటఎత్తకుండా వ్యతిరేకంగా ఉన్న విషయాలనే తీర్మానంలో ఏకరువు పెట్టారనీ, జూస్ట్ ఫిర్యాదుచేసెను.

## పోలీసలుతో కార్మికుల సంఘర్షణ

### 12 మందికి గాయములు

కలకత్తా, డిసెంబరు 6: నేటి ఉదయము బరంగోర ప్రాంతములో పోలీసులకు ఫాక్టరీ కార్మికులకును యేర్పడిన సంఘర్షణలో దాదాపు 12 మంది గాయపడిరి. వీరిలో ముగ్గురు పోలీసులు మాత్ర పడియున్న ఫాక్టరీలోనికి బలవంతముగా ప్రవేశించు ఉద్దేశ్యముతో ఫాక్టరీపనివారు ఫాక్టరీ ద్వారమును బద్దలుకొట్టిరి. పోలీసులు ఆ ప్రదేశమునకురాగా కార్మికులు వారిపై రాళ్ళురువ్విరి. వారిని చెదరగొట్టుటకు పోలీసులు లాఠీచార్జి చేసిరి. 18 గురుని కస్టడీలోనికి తీసికొనిరి. పరిస్థితులు యిప్పుడు శాంతముగానున్నవని తెలియుచున్నది.

## సంస్థానకాంగ్రెస్ విభేదాలు

(1 వ పేజీ తరువాయి)

లం వ్యక్తిగతమైందని తెలియజేశారు. ప్రజాస్వామిక సంస్థలో అప్పటప్పట కొన్ని సర్దుబాట్లు చెయ్యటం అవసరముగనీ, అయితే వీటిని పరస్పర సహకారంతోను, సద్భావంతోను చేసుకోవచ్చుననీ ఆయన అభిప్రాయపడ్డారు. అధ్యక్ష ఎన్నికలవలన సంస్థాన కాంగ్రెస్ చీలికలుకాదనీ, లోగల కొన్ని సమస్యలపై సమాధానం కుదురుటకు కారణమైన సామరస్యము ఆ తర్వాతకూడ ఉండగలదనీ ఆయన ఆశ వెలిబుచ్చారు.

ఉభయపక్షములు అంగీకృతమైన ముసాయిదాను, దిగంబరరావుబిందూ, బి. రామకృష్ణరావుగార్లిద్దరు కలసి తయారుచేశారని తెలుస్తున్నది. "సంస్థాన కాంగ్రెసులోని విభేదాలను తొలగించుటకుగాను అధ్యక్ష ఎన్నిక పోటీనుండి స్వామి రామానందతీర్థ, బూర్గుల రామకృష్ణరావుగారలు యిరువురు విరమించి, ఉభయపక్షాలతో సంప్రదించిన అనంతరం నిర్ణయించబడు వ్యక్తిని బలపరచుట అవసరమని అంగీకరించబడినది." అని యీముసాయిదాలో ఉదహరించబడిది.

ముసాయిదాలోని మొదటి క్లాజును గురించే అభిప్రాయ భేదాలువచ్చి సంప్రదింపులు భగ్నమైనవని తెలుస్తున్నది.

రామకృష్ణరావుగారు సంప్రదింపులు భగ్నమయినందుకు విచారం వెలిబుచ్చుతూ, ముసాయిదా ప్రతిపాదనలన్నిటినీ ఉభయపక్షాలు ఆమోదించియుండినట్లయితే, విభేదాల పరిష్కారానికి మార్గం కనుపించి యుండేదన్నారు. త్వరలో జరుగనున్న రాజ్యాంగ పరిషత్తు ఎన్నికల కొరకు పార్లమెంటరీ బోర్డు ఏర్పాటు చెయ్యటమనే విషయం కూడ ముసాయిదా ప్రతిపాదనలలో ఉన్నదన్నారు.

ముసాయిదాలోని ప్రతిపాదనలన్నిటినీ పూర్తిగా అమలు జరుపవలెననీ, రెండవ పక్షంవారు మొదటి క్లాజును అంగీకరించక పోవటంవల్ల ముసాయిదా పూర్తిగా రద్దయినట్లు భావించవలెననీ, రామకృష్ణారావుగారు ఒక ఇంటర్వ్యూలో అన్నారు.

ముసాయిదాలో అధ్యక్ష ఎన్నికకు సంబంధించిన ప్రతిపాదనపై ఉభయులకు అంగీకారం కుదరక పోయినప్పటికీ, యితర ప్రతిపాదనలకు అమలు జరుపవచ్చునని వైఖరిని దిగంబరరావు బిందూ అవలంబించారట. రామకృష్ణారావుగారు దీనికి సమ్మతించనట్లు తెలుస్తున్నది.

## కృష్ణా జిల్లాలో కమ్యూనిస్టు చర్యలు

(1-వ పేజీ తరువాయి)

వర్ధనున్న మల్లవరం అనే భారతగ్రామములో సంస్థాన కమ్యూనిస్టులు దోపిడీ చేశారనీ రెండు వేల రూ॥ల ఖరీదైన ఆస్తిని దొంగిలించారనీ తెలిసి జిల్లా సూపరింటెండెంటు సి. జె. పి. పింటో, ఉత్తర డి. ఐ. జి. వి. ఆర్. రాజరత్నంగారు మల్లవరం వెళ్లి గ్రామస్థులకు అభయమిచ్చి, అక్కడ మలబార్‌పోలీసు దళములు రెంటిని ఉంచారు. కమ్యూనిస్టు దాడులకు లొంగిపోవద్దని, ప్రతిఘటించి తరిమివేయవలసినదనీ వారు ఉద్బోధించారు. వారు తిరువూరు మొదలగు సరిహద్దు ప్రాంతాలను కూడా దర్శించి గత సాయంత్రం ఇక్కడకు వచ్చారు.

గత నెల రోజులుగా తిరిగి విజృంభిస్తున్న హైదరాబాదు కమ్యూనిస్టుల బాధులనుండి ప్రజలను రక్షించటానికిగాను తిరువూరు సరిహద్దుకు నిన్న రెండు ప్రత్యేక సాయుధ పోలీసు దళములను పంపించామని పింటోగారు చెప్పారు. కృష్ణాజిల్లాలో కమ్యూనిస్టు చర్యలను గూర్చి చెబుతూ, గ్రామాలలో కమ్యూనిస్టుల పలుకుబడి పూర్తిగా నశించినదనీ, గ్రామస్థులే వారిని ఎదుర్కొని, పట్టుకొని, పోలీసుల కప్పగిస్తూండటంచేత కమ్యూనిస్టులు గ్రామాల్లో కనిపించటానికికూడా భయపడుతున్నారనీ ఆయన అన్నాడు. కమ్యూనిస్టులు విద్యార్థుల వసతులలోకూడా తలదాచుకొన ప్రయత్నించి విఫలులై, బయటపడిపోయారనీ, జిల్లాలో ప్రముఖ నాయకులందరూ అరెస్టయ్యారనీ, నిన్నటిరోజున నవరుగూడెంలో కృష్ణాజిల్లా కమ్యూనిస్టుల సరుకు యావత్తు బయట పడిందనీకూడా పింటోగారన్నారు.

"కృష్ణాజిల్లా ఒకప్పుడు భారతీయ కమ్యూనిస్టులందరికీ ప్రధాన కేంద్రాల్లో ఒకటిగావున్నది. ఇప్పుడది వారికి పూర్తిగా నిరుపయోగంగా పరిణమించింది. పోలీసులకు గ్రామస్థులీ విషయంలో పూర్తిగా సహకరిస్తున్నారు. కమ్యూనిస్టులు ఇక గతిలేక ఆడవాళ్ళసహాయం కోరుతున్నారు. కాని వారిపని ముగిసినట్లే" అని పింటోగారన్నారు. వి. స్వ.

## బ్రిటిషు స్టెర్లింగు నిల్వల సమస్య

### ప్రభుత్వ వైఖరిపై కన్సర్వేటివు సభ్యుని విమర్శ

లండను, డిసెంబర్ 6 : నేడు బ్రిటిషు పార్లమెంటులో మాట్లాడుతూ ఒక కన్సర్వేటివు సభ్యుడు, బ్రిటిషు ప్రభుత్వం వారు స్టెర్లింగు బుణాలను తగ్గిస్తామని ప్రకటించికూడా తగ్గించనందుకు విమర్శించాడు. 1947 మే 12 న బ్రిటిషు ప్రధాని పార్లమెంటులో చేసిన ప్రకటనను ఆయన ఉదహరించాడు. క్రిప్సుకుముందు కోశాధ్యక్షుడుగాఉన్న డాల్టను, స్టెర్లింగు బుణాలభారం యుద్ధకాలంలో పద్ధులు తేనే వింతవిధానంవల్ల బ్రిటనుపై పడింది వాటిని చాలావరకు తగ్గించాలని ఉంటుందనీ అన్నారని ఈ కన్సర్వేటివు సభ్యుడు చెప్పాడు.

డాల్టను పైమాటలన్నదీ, వాటిని అట్లీ పార్లమెంటులో సమర్థించినదీకూడా నిజమే.

కాని సర్ స్టాఫర్డుక్రిప్సు సమాధానం చెబుతూ, అట్లీ పార్లమెంటులో అన్న మాటలనుబట్టి ప్రభుత్వంవారు స్టెర్లింగు బుణాలను తగ్గించేవిధానం అవలంబిస్తారనలేదన్నారు. ఈ బుణాలుగురించి ప్రభుత్వవిధానంలో మార్పు జరగలేదనికూడా ఆయన చెప్పారు.

## ప్రధాని ప్రకటన

(1-వ పేజీ తరువాయి)

శాస్త్ర ప్రవీణులైన అధికారుల ఉపసంఘములు ఈ సభ్యులకు సలహా ఇవ్వగలవు. రేపు ఆర్థికవిషయాలను చర్చించునపుడు ఆర్థిక ప్రవీణులు సలహానిచ్చెదరు. అంతేగాని ఈ కమిటీకి సలహాలిచ్చే అనధికారులు ఉండరు.

ప్ర : ఈ కమిటీవారికి ఒక గడువు నిర్ణయించినారా ?

స: ఎటుల నిర్ణయించగలము. నిర్ణయించలేదు. వారే నిర్ణయించుకొనగలరు.

ప్ర:- జనవరి 26 లోపల కార్యక్రమము ముగించగలరా? రాష్ట్రమువచ్చు ఏర్పాటు చేయగలరా ?

స:- అది ఎవ్వరునూ చెయ్యలేరు; మానవులకు అశక్యము అన్న మాట సరేగదా భగవంతునికికూడా అది సాధ్యముగాదు. అందుకే మేము అది సాధ్యపడదని కేంద్రమునకు వ్రాసితిమి. ఉన్నది ఒక్క మాసము ఎటుల ముగింపగలము?

ప్ర:- శ్రీ వెంకట్రావుగారు జనవరి 15 కు విభజనసంఘం పని ముగిస్తే 26 కు రాష్ట్రం రాగలదని చెప్పారుగదా?

స :- అసాధ్యమైన విషయాలను చెప్పి ఏమి ప్రయోజనము? ఆయన కేంద్ర ప్రభుత్వ లేఖాంశములచూడక పూర్వము ఆ మాట చెప్పిఉండవచ్చు. ఇందులోఆయిదుగురు మంత్రులు సభ్యులుగా ఉన్నారు. మిగతా అనధికారులు ముగ్గురు సభ్యులు. వారు పని ముగించాలనుకున్నా అధికారం ఖ్యాతులమైన మేము అది అసాధ్యమని చెప్పగలము. సమాచారము సేకరించవలసినది మేమునిర్ణయముల అమలుచెయ్యవలసిన బాధ్యత వహించవలసినది మేము, నిర్ణయముల పాలించవలసినది మేము కేంద్రప్రభుత్వమునకు వ్రాసిన దానికి వారు సమాధానము ఇవ్వరు. ఇవ్వవలసిన అవసరంలేదు. జనవరి 26 లోపల పని ముగించుట సాధ్యముగాదు. కష్టసుఖాలన్నీ ఆలోచించే ఏప్రిల్ 1 వ తేదీకి. అన్ని యత్నాలు చెయ్యవచ్చునని చెప్పాము.

ప్ర:- రెవిన్యూ జిల్లాలతో విభజించటం సులభమని వెంకట్రావుగారు చెప్పినారే?

స:-వారు ఏ నిర్ణయానికి వచ్చినా వారికి స్వేచ్ఛ ఉన్నది. అది సాధ్యముగాదని మాకు గల అనుభవముతో మేము చెప్పుచున్నాము. విభజన సంఘములో సభ్యులైన తర్వాత వారు ఆమాట చెప్పక పోవచ్చును. వారుగాని కామరాజుగారుగాని అనధికార సభ్యులు మాత్రమే.

ప్ర:-ఏప్రిల్ 1 వ తేదీపైన రాష్ట్రం వస్తుందా?

స:-విభజన సంఘంవారు కార్యక్రమాన్ని చురుకుగా నిర్వహించేదానిపై అది ఆధారపడి ఉంటుంది. మూడుమాసాల వ్యవధి ఉన్నది.సాధ్యంగావచ్చు. ఏప్రిల్ 1 వ తేదీ లోపల ఎంత సతమతపడినా సాధ్యపడదు."

## డిటెన్యూ విడుదల

మదరాసు, డిసెంబరు 6: గుంటూరు జిల్లా కమ్యూనిస్టు శ్రీ మోటూరు కోటయ్యను విడుదల చేయవలెనని ప్రభుత్వము వుత్తర్వు చేసెను.

## గుంటూరు జిల్లా బోర్డు ఉపాధ్యక్షులుగా గురవారెడ్డిగారి ఎన్నిక

గుంటూరు, డిసెం 7:— గుంటూరు జిల్లాబోర్డు ఉపాధ్యక్షులుగా ఎం. గురవారెడ్డిగారు (కాంగ్రెస్ అభ్యర్థి) ఏకగ్రీవంగా ఎన్నుకోబడినారు. (స్వ. వి.)

# మురుసుమిల్లి హత్య కేసు తీర్పు

## ముద్దాయిల శిక్ష వివరాలు

విజయవాడ, డిసెంబర్ 5: మురుసుమిల్లి హత్య-అపహరణము కేసులో మొదటి నల్గురు ముద్దాయిలకు నాలుగున్నర సంవత్సరములు కఠినశిక్ష విధించుచూ నేడు విజయవాడ అడిషనల్ అసిస్టెంట్ సెషన్సుజడ్జి బి. సి. హెచ్. నారాయణ మూర్తిగారు తీర్పు నిచ్చిరి. మిగిలిన ఆరుగురు ముద్దాయిలపైన, నేరము ను ఋజావు చేయుటకు తగిన సాక్ష్యము లభింపనందువలన, వారిని విడుదల చేయుచూ ఉత్తరువు చేశారు.

ముద్దాయి లందరునూ 16-8-48 నాడు అక్రమ సంఘములుగా ఏర్పడి, ప్రాణాపాయము చేయు సంకల్పములో కొందరు వ్యక్తులను అపహరించిరి కావున, మొదటి నేరమునకై 148 సెక్షన్ [ఇండియన్ పీనల్‌కోడ్] క్రిందనూ, రెండవ నేరమునకై 149 సెక్షన్ - 364 సెక్షన్ క్రిందనూ నిందితు లనుదురని నేరము మోపబడినది. మొదటి ముద్దాయి [నల మల వెంకటేశ్వరరావు] మూడవ ముద్దాయి [చోడిబోయిన గోపాలం] లపై ఆయుధ చట్టము 19-ఇ. సెక్షన్ క్రింద నేర మారోపింపబడెను.

గత సంవత్సరము ఆగస్టు 16 నాటి రాత్రి,ముద్దాయిలు మురుసుమిల్లి గ్రామములో ప్రవేశించి, హైదరాబాదు సంస్థానము నుండివచ్చి మురుసుమిల్లిలో నివసించుచున్న ఎ. వి. సత్యనారాయణరావును, మరి ఐదుగురను (సీలం లింగారెడ్డి, నరసింహయ్య, కె. రామయ్య, కందుల సత్యనారాయణ, కలసాని జమలాపురి) సంస్థాన సరిహద్దుల లోనికి ఎత్తుకొనిపోయి- సూర్యనారాయణ రావును చంపివేసిరని, ప్రాసిక్యూషన్ వారి కథనము. ఈ సందర్భములో 15 మందిని పోలీసులు అరెస్టు చేసి, విజయవాడ అడిషనల్ స్పెషల్ సెకండ్ క్లాస్ మేజస్ట్రేటు వద్ద విచారణకు తెచ్చిరి. విచారణలో 10 మందిపై నేరము మోపబడి, కేసు అడిషనల్ అసిస్టెంట్ సెషన్సు జడ్జిముందు పునర్విచారణకు మార్చబడెను.

ముద్దాయిల పక్షపు న్యాయవాదులు, ఈకేసును విచారించుటకు, కోర్టువారికి అధికారములేదని వాదించిరి. కాని ప్రభుత్వ న్యాయవాది,యూనియన్ ప్రాంతములో జరిగినంతవరకు నేరమును ఈ కోర్టు వారు విచారించుట కధికారము కలిగియుండిరనిరి.

జడ్జీగారు తీర్పులో, మంగపతి దళము వారు మురుసుమిల్లిపై దాడి చేయుటపైననూ, దాడిచేయుటకు గల కారణములపైననూ, చెప్పబడిన సాక్ష్యము విశ్వసనీయముగనే ఉన్నదనిరి. మానవుని మానసిక ప్రవర్తనను ఇదమిత్థమని తేల్చుట కష్టము. స్వల్పకారణములను పురస్కరించుకొని ఈ ప్రేకపరులు తీవ్రచర్యలను చేయ పూనుకొనుదురు. పెద్ద కారణములున్ననూ,ప్రశాంతముగా ఆలోచింపగలుగువారు కొందరపడరు ముద్దాయిలను, కమ్యూనిస్టులను నెపముతో, విచారించుచున్నారనుట పకాదు. ముద్దాయిలు దాడిలో పాల్గొని కొందరను అపహరించిరా లేదా అనునదే విచారణీయాంశము. ఆ నేరములు ఋజువైనవి. నిందితులు కొందరిపై పగబూని, ఇట్టిపని చేసిరని సాక్ష్యము ఋజావు చేయగలిగినది. వ్యక్తుల నపహరించి, సంస్థాన సరిహద్దులలోనికి తీసికొనిపోయి, ఒకరిని నిర్దాక్షిణ్యముగా చంపివేసిరి కాని దాడి, అపహరణ కృష్ణాజిల్లా సరిహద్దులలోననే జరిగినవి. అంతవరకూ ఈ కోర్టుకు విచారించు అధికారమున్నది అని జడ్జీగారు తీర్పులో తెల్పిరి.

ఏ ప్రత్యేక ముద్దాయి, అపహరణ చేసినాయను ప్రశ్న అనవసరము. మొదటి నల్గురు ముద్దాయిలు నల్లమల వెంకటేశ్వరరావు, నన్న వెంకట నరసయ్య, 'చోడిబోయిన గోపాలం, వరగాల గోపయ్య-అక్రమ సంఘముగా ఏర్పడి, కొందరి) అపహరించిరి. ఒకటవ, మూడవ ముద్దాయిలు ఆయుధ చట్టము క్రింద నేరస్థులగుదురు. రెండవ ముద్దాయి సూర్యనారాయణ రావును చంపెను. నాల్గవ ముద్దాయి కూడా ఈ అక్రమ సంఘ చర్యలలో భాగస్వామియే. మిగిలిన ఆరుగురు ముద్దాయిలుకూడా ఇందులో నున్నారని ఆరోపింపబడినను, ఆ ఆరోపణలను ఋజావు చేయగల సాక్ష్యము లేదు గాన వారిని విడుదల చేయనగుచున్నను. మొదటి నల్గురకు నాల్గున్నర సంవత్సరములు కఠిన శిక్షను విధించవలసినది " అని తీర్పు యిచ్చారు.

మొదటి ముద్దాయి పక్షమున కె. జగన్నాథ రావు, మిగిలిన ముద్దాయిలకై పి. వి. రాఘవయ్య, ప్రభుత్వ పక్షమున కపిలచిన వెంకటరావు గారలు వాదించిరి.

(స్వ. వి)

షిప్‌యార్డు నిర్మాణ ? ... కొరకు కార్పొరేషను వారడిగిన రూ. 10 లక్షల ఋణం మదరాసు ప్రభుత్వంవారు యివ్వజాలమనిరి. 1950-51 సం॥ బడ్జెటు పార్టు 2 స్కీములో దీని నాలోచింప గలమనిరి.

# భీమా చట్ట సవరణ బిల్లు

## సెలెక్టు కమిటీకి నివేదన

న్యూఢిల్లీ, డిశంబరు 6: భారత వాణిజ్యశాఖా మంత్రి శ్రీ కె. సి. నియోగి తెచ్చిన ఇన్సూరెన్సు బిల్లును నేడు పార్లమెంటు సెలెక్టుకమిటీకి పంపించింది

ఇవ్వాళ్ళను, నిన్నను దీనిమీద జరిగిన చర్చలో చాలామంది సభ్యులు ప్రొఫెసర్ షా వెల్లడించిన భావాలతో ఏకీభవిస్తూ ఈ వ్యాపారాన్ని జాతీయంచేయడం మంచిదన్నారు. విదేశీ సెక్యూరిటీలను ప్రభుత్వం చేత గుర్తింపబడిన సెక్యూరిటీలుగా భావించేందుకు గూడా వీలులేదని ఈసభ్యులు వాదించారు.

శ్రీ జస్పత్‌రాయ్ కపూర్ మాట్లాడుతూ ఈ వ్యాపారాన్ని జాతీయంచేసే సమయం ఆసన్నమైనదని,కాని ఆట్లా చేస్తేనే గాని పరిస్థితి బాగుపడదని అన్నారు. ఒకవేళ్ళ అట్లా జాతీయం చేయడం ప్రభుత్వానికి ఇష్టంలేకపోతే, దాన్ని తీవ్రంగా కంట్రోలు చెయ్యాలని ఆయన సూచించారు.

శ్రీ ఓ. వి. అలగప్పన్ ప్రభుత్వాన్ని బలపరిచారు. ఈ బిల్లుతో ఇన్సూరెన్సు వ్యాపారంలో కొంతభాగమైనా జాతీయం అవుతున్నందుకు సంతోషించవలసి వుందని ఆయన అన్నారు. ప్రభుత్వం ఇప్పుడు ఇన్సూరెన్సు కంపెనీలమీద గట్టి అధికారాన్ని చలాయించబోతోంది గాబట్టి, ఈబిల్లుతో అటువంటి అధికారాన్ని కైసేయడానికి అయిన కారణాలు ప్రజలు తెలుసుకోగలట్లుగా తమవద్దవున్న ఆధారాన్నంతా బయట పెట్టవలసిందని కోరారు.

ఇప్పుడు ప్రవర్తిల్లుతున్న పరిస్థితిమీద అధ్యాన్నమయ్యేవాదకాళంబిలులో వున్నదని శ్రీపంజాబ్‌రావు దేశముఖ్ అన్నారు. అదీకాకుండా ఈ బిల్లు కౌన్ జీ జహాంగీర్ కమిటీ సూచనలమీద తయారు చేయబడింది కాబట్టి, కాలానికితగినట్లుగాగూడా లేదని ఆయన అన్నారు. మారిన పరిస్థితుల వాసనలేమీ ఈబిల్లులో లేవని అందువల్ల ఈ వ్యాపారాన్ని జాతీయం చేయడలచుకుంటే తప్ప ప్రభుత్వ ఇటువంటి బిల్లుకు తెచ్చేందుకు వీలులేదని డా॥ దేశముఖ్ అన్నారు.

ఇన్సూరెన్సు కంపెనీలలో గుత్తదారీతనాన్ని అరికట్టడానికి ఈ బిల్లు ప్రయత్నించడం హర్షించదగిన విషయం. నజీరుద్దీన్ అహ్మద్ బోధించారు. చిన్న కంపెనీల విషయంలో ప్రభుత్వం కొంచెం ఉదారంగా వ్యవహరించాలని ఆయన కోరారు.

అంతటితో చర్చను ముగింపుకు తీసుకు రావలసిందిగా శ్రీ సత్యనారాయణ సిన్‌హా ఒక ప్రతిపాదన తీసుకు రావడంతో శ్రీ నియోగి విమర్శలకు సమాధానం చెప్పారు.

ముందుగా ఆయన ఈ వ్యాపారాన్ని జాతీయం చేయడం విషయమై సభ్యులు చేసిన సూచనలను ఎత్తుకొని, కొంతకాలం దాకా అన్నీ యిట్లా సాగితే, తరువాత దాన్ని జాతీయం చేయవచ్చునని అన్నారు. ఇప్పుడు ఈ జాతీయం చేయకుండున్నవాళ్లు ఈ బిల్లును తీసుకురావడం తున్నట్లయితే, ఈ వ్యాపారాన్ని అందాకా విశృంఖలంగా సాగిపోనీయాలన్న భావం వీరికి వున్నటు అర్థం చేసుకోవలసి వస్తున్నది. కాని అట్లు జరపడానికి వీలులేదు అని శ్రీ నియోగి స్పష్టం చేశారు.

విదేశీ కంపెనీలు తమ ఆస్తులను విదేశీ సెక్యూరిటీలలో వినియోగించు కోటాన్ని సభ్యులు విమర్శించారు గాని, ప్రస్తుతానికి ప్రభుత్వం ఇట్లా అంగీకరించినా, తరువాత వారిని క్షేమమైన సెక్యూరిటీలలోకి వాటిని మార్చవలసిందిగా కోరుతుందని, ఈ అంగీకరించడం వారికి అందు నిమిత్తం తగిన విసులుబాటును కలిగించడం తప్ప మరేమీ కావని, అందువల్ల సభ్యులు ఇందులో అనుమానం పెట్టుకోవలసిన అవసరం ఏమీ లేదని అన్నారు.

చిన్న కంపెనీల విషయంలో సభ్యులు వెలిబుచ్చిన భయాన్ని పారద్రోలుతూ, ప్రభుత్వం వాటి విషయంలో ఉదారంగా ప్రవర్తిస్తుందని, వాటికి ఇన్సూరెన్సు అసోసియేషన్‌లో మంచి ప్రాతినిధ్యం లభించే ఏర్పాట్లు కూడా బిల్లులో వున్నవని శ్రీ నియోగి అన్నారు.

అనంతరం పార్లమెంటువారు బిల్లును సెలెక్టుకమిటీకి పంపడానికి అంగీకరించారు

# జనరల్ లాహోన్ ప్రవాసం

సైగాన్, డిసెంబరు 6: ఇటీవల తన పదవికి రాజీనామా ఇచ్చిన యూనానుగవర్నరు జనరలు లూహోన్ ఫ్రెంచి ఇండోచైనాలోని హనోయిలో తలదాచుకొనదలచినట్లు నేడిక్కడ నమ్మకంగా తెలుస్తున్నది.

# సరుకు వెలలకు స్థిర ప్రమాణం

## నిర్ణయింపవలసిన ఆవశ్యకత: భారతప్రతినిధి హెచ్చరిక

### ప్రపంచ ఆహార వ్యవసాయ సంఘ సమావేశం

వాషింగ్టన్, డిసెంబరు 6: భారత ప్రతినిధి యస్. జి. అభయంకర్ ఈ వేళ ఐక్యరాజ్య సమితి ఆహార వ్యవసాయ సంఘంలో ప్రసంగిస్తూ, సరుకుల వెలలకు స్థిర ప్రమాణాన్ని నిర్ణయించుటకు ప్రూనుకొనవలెననూ, వస్తూత్పత్తి వ్యవహారములను సరిగా సర్దుబాటు చేయవలెననూ అన్యోకమునగాని సరకుల క్లిష్ట పరిస్థితి నివారణకు తగిన పరిష్కార మార్గం కన్పించలేదు అని అన్నాడు. మిగులు సరకులకు సంబంధించిన సమస్యలను పరిశీలించే కమీషన్‌తో అభయంకర్ మాట్లాడుతూ, ఆయా దేశాలలో వ్యవసాయ విధానాలను సంస్కరించుటకు తీవ్రప్రయత్నం జరగాలని వ్యవసాయదారుకు, దీర్ఘకాలం గిట్టుబడిగా ఉండే మార్కెట్ ఉంటే రైతులకు ఉత్పత్తి నష్టదాయకముగా ఉండుట తీరిపోగలదు. ఉత్పత్తిగూడా చాలా ఎక్కువ కాగలదు

ఇదివరలో ప్రతిపాదింపబడిన, వస్తు క్రయవిక్రయ సంస్థను స్థాపించే పథకం గాని అందుకు ప్రత్యామ్నాయంగా వస్తు క్రయవిక్రయ సంప్రదింపు సంఘ స్థాపన గాని తృప్తికరంగా లేవు. ఉభయ పథకాలు, వ్యవసాయోత్పత్తి ధరల విధానంలో, అత్యవసరంగా జరగవలసిన సర్దుబాటులకు ప్రాముఖ్యం చూపలేవు.

వ్యవసాయదారులు, మళ్ళీ ఆర్థిక మాంద్యపు దురవస్థకు పాల్పడకుండా చూడాలన్నదిశ్శఅందరూ అంగీకరించు ప్రధాన సూత్రము.

వ్యవసాయదారుకు, దీర్ఘకాలం గిట్టుబడిగా ఉండే మార్కెట్లపైనే యే దేశ సౌభాగ్యమైనా ఎక్కువగా ఆధారపడి ఉంటుంది. యుద్ధకాలంలోవలె, ధాన్యం ధరలను విపరీతమైన ప్రమాణానికి పెంచితే, వ్యవసాయదారు శ్రేయస్సుకే భంగం వాటిల్ల గలదు.

కాబట్టి వ్యవసాయ ఫలసాయమునకు ధరల స్థిరీకరణ వ్యవహారాల ఎక్కువకాలం వాయిదా వేస్తే సమస్య తీవ్రరూపం దాల్చగలదు. కొన్ని సంవత్సరాల తరువాత ఈ సమస్యను పరిష్కరించ బూనుకొంటే పని చాలా దుర్ఘటంగా కలిపిస్తుంది.

సరకుల క్రయవిక్రయ సంప్రదింపు సంఘస్థాపనకు ఇండియా అంగీకరిస్తున్నా; అంతర్జాతీయ వస్తు క్రయవిక్రయ సంస్థ స్థాపనకు వైముఖ్యం చూపినవారిపట్ల సానుభూతి చూపుతున్నది

# తుపాను బాధితులకు సహాయనిధి

## మేయరు విజ్ఞప్తి

చెన్నపట్నం, డిశంబరు 6: అక్టోబరు మాసమున ఆంధ్రజిల్లాలలో తుపానువల్ల కలిగినఆపారనష్టము యింతవరకనివినియుండలేదు మనుష్యులు జీవాలుచాలానష్టమై వేలకొలది ప్రజలు నివాసములను గోల్పోయి నిలువనీడలేక అమితముగా బాధపడుచున్నారు. అందువల్ల ప్రతిభారతీయుడు ముఖ్యముగా రాష్ట్రములోనివారు ప్రతిపురుషుడు స్త్రీయును ఆంధ్ర తుపానుబాధితులకు సహాయమొసగం ధర్మమగును.

చెన్నరాజధాని క్షేమనిధివారు గవర్నరుగారి ఆంధ్ర తుపాను సహాయనిధిని బాధిత ప్రజలసహాయార్థం ధనమువసూలు చేయుటకు ప్రారంభించియున్నారు.

చెన్నగరమున ఈ నిధికమిటీ అధ్యక్షులైన మేయరుగారు ఆంధ్రతుపాను బాధితులసహాయార్థము నగరవాసులు తమశక్తికొలది ఔదార్యములో విరాళము లొసగి తోడ్పడవలెనని విన్నవించుచున్నారు ప్రజలనుండి డబ్బువసూలు ఏర్పాట్లనుగూర్చి ఆలోచించుటకు మేయరుగారు డిశంబరు 10 వ తేదీని ఉదయం 10-15 గంటలకు కార్పొరేషను కౌన్సిలు ఛేంబరులో సభజరుపగలరు.

# మంత్రులపై ఫిర్యాదులు

మదరాసు మంత్రులపై ఫిర్యాదుల గూర్చి మదరాసు ప్రధాని నిజేదిక నెహ్రూ పటేలు రాజేంద్రప్రసాదు గార్లకు పంపబడె ననియు, వారింకను తమ రిపోర్టు కాంగ్రెసు అధ్యక్షునకు పంపలేదనియు, అన్యవహారం ముగిసిందని చెప్ప వీలులేదనియు, కాంగ్రెసు కార్యదర్శి శ్రీకళా వెంకట్రావుగారు పత్రికా విలేఖరులకు జవాబిచ్చిన తెలిపిరి.

# హిందూ మహాసభ సావర్కార్ ప్రారంభోత్సవం

బొంబాయి, డిసెంబరు 6: డిసెంబరు నాల్గవవారములో కలకత్తాయందు జరగనున్న అ. భా. హిందూమహాసభా సమావేశమును శ్రీ వినాయక దామోదర సవర్కారుగారు ప్రారంభింతురని నేడు అధికార పూర్వకముగా తెలిసినది.

# బొంబై కర్నాటక మంత్రి రాజీనామా

## కర్నాటకరాష్ట్ర నిర్మాణం: కాంగ్రెస్ వైఖరిపట్ల అసమ్మతి

బొంబాయి, డిశంబరు 6:—కర్నాటక రాష్ట్రమును నిర్మించవలెనను అసమ్మతి వెల్లడించుటకు గాను బొంబాయి వ్యవసాయ అటవికశాఖ మంత్రి ఎస్. పి. పాటిల్ రాజీనామా నొసంగ నిర్ణయించెను. ఈతడు కర్నాటకనివాసుడు. కర్నాటక కాంగ్రెస్ నిర్ణయమును గౌరవించుటకై యిట్టిదర్యవైఖరి ఆయన నిశ్చయించినాడు. రేపు ఆయన రాజీనామా పత్రమును బొంబాయి ప్రధానికి అందజేయునని తెలియుచున్నది.

బొంబాయి ప్రభుత్వము నందలి కర్నాటక పార్లమెంటరీ కార్యదర్శులు నల్గురిలో ముగ్గురు రాజీనామా నివ్వ నిశ్చయించినారు. నాల్గవ యతడు గూడ వీరినే గమించునని అనుకొనుచున్నారు. బొంబాయి శాసనసభ ఉపాధ్యక్షుడు అంజాడీగారు గూడ తన రాజీనామాను కె. పి. సి. సి. కార్యదర్శికి పంపియున్నాడు.

### 'ఓర్పు వహింపుడు'

(స్వకీయ విలేఖరి)

బొంబాయి, డిసెంబరు 6 కర్నాటక శాసన సభ్యుల రాజీనామాలకు, రాజీనామా బెదరింపులకు ఒక్క బొంబాయి పత్రికా గూడ హర్షము వెలిబుచ్చలేదు. టైమ్సు ఆఫ్ ఇండియా పత్రిక తన మామూలు ధోరణిలో వ్రాయుచు ఒకవంక కాంగ్రెస్ అధిష్టాన వర్గము, కేంద్ర ప్రభుత్వము నకును మరియొక వంక కర్నాటక కాంగ్రెసుకును అభిప్రాయ భేదము వృద్ధియగుచున్నదని చెప్పుచు యిట్టి పరిణామమునకు లోలోన హర్షించుచున్నది. ఆంధ్రుల కోర్కెలను అంగీకరించినందులకు కేంద్ర ప్రభుత్వమును తప్పు బట్టుచున్నది. కర్ణాటకులు ఓర్పు వహించియుండవలెనని యితర పత్రికలు వ్రాసినవి. కన్నడిగలు, మైసూరు కన్నడిగలతో ఒప్పందము చేసికొన వలెనని, ఆంధ్ర సరిహద్దు పరిష్కారమునకై వేచియుండవలెనని అవి వ్రాసినవి.

# బొంబై మంత్రుల అస్వస్థత

బొంబాయి మంత్రులగు శ్రీ దినకర్ దేశాయి, ఎల్. ఎమ్. పాటిల్ గారలు నెల రోజులపైగా అస్వస్థులైయున్నారు. వీరుపనిచూచుటకు సెక్రటేరియటుకు రాకపోవుట చేత వీరి శాఖల పనిపేరుకున్నది.

# పాకిస్థాన్-భారత సరిహద్దు తగాదా

## కలకత్తాలో విచారణ ప్రారంభము

కలకత్తా డిసెంబరు 5: పాకిస్థాను భారతదేశ సరిహద్దు తగాదా పరిష్కార సంఘము న్యా॥ అల్గాట్ బాగ్ అధ్యక్షుడిగా నేడు యిచ్చట విచారణ ప్రారంభించెను. ఇండియా ప్రభుత్వమువారు నియోజించిన న్యా॥ చంద్రశేఖర అయ్యరుగారు పాకిస్థాన్ నియోజించిన న్యా॥ మహబుద్దీన్ గారు హాజరైరి. భారత ప్రభుత్వ పక్షు న్యాయవాది కార్యక్రమమును ఉపక్రమించుచు ముర్షిదాబాదు, రాజ్‌షాహీ ప్రాంతములలో యేర్పడిన తగాదాలవిషయమై ప్రస్తావించిరి.

న్యా॥ అల్గాట్ బాగ్ విచారణ ప్రారంభమైనట్లు ప్రకటించుచు కలకత్తాలో విచారణ జరుపుటకు ప. బెంగాలు ప్రభుత్వమువారు కల్పించిన సౌకర్యములకు కృతజ్ఞత తెల్పి యిట్లనెను: "అతి ముఖ్యమైన పను స్థితులను పరిష్కరింపవలసి యున్న ఈ విచారణ సంఘమునకు అధ్యక్షత వహించవలసినదని నన్ను కోరుట మహాగౌరవముగా నెంచుచున్నాను. న్యా॥ చంద్రశేఖరయ్యరు, న్యా॥ మహబుద్దీన్ గారలవంటి ప్రతిభావంతులగు న్యాయమూర్తులను సాతి విచారణ కర్తలనుగా బడసినందుకు నేను కృతజ్ఞత తెలుపవలసియున్నది. జ్ఞాన విజ్ఞాన శోభితులుగా ఉభయపక్షముల న్యాయవాదులను అహ్వానించుచున్నాను. ఈ తగాదాలలో న్యాయమైన నిర్ణయములకువచ్చుటకువారు అత్యంతము తోడ్పడెదరని విశ్వసించుచున్నాను. ఈ విచారణ సంఘము మొదట కలకత్తాలోను, తరువాత ఢాకాలోను, విచారణ జరుపును. ప. బెంగాలుకు సంబంధించిన తగాదాల విషయమై కలకత్తాలో విచారణ జరుగును. తూ. బెంగాలుకు సంబంధించిన తగాదాల విషయమై ఢాకాలో విచారణ జరుగును. కలకత్తా విచారణ, తగాదా ప్రాంతముల తనిఖీతో సహా క్రిస్టమస్‌లోపుగా పూర్తి యగునని, రాబోవు సంవత్సర ప్రథమ వారమున ఢాకాలో విచారణ ప్రారంభమగునని మేము ఆశించుచున్నాము. నిర్ణీత కాలములో విచారణ సంఘము తనపని పూర్తి చేయుటకు ఉభయ పక్షముల న్యాయవాదులు తోడ్పడెదరని విశ్వసించుచున్నాను."

అనంతరముబట్టి బహిరంగముగాను రహస్యముగాను విచారణ జరుపుటకు విచారణ సంఘము వారు నిర్ణయించిరి.

తగాదాలను విచారించుటలో న్యాయసూత్రములను అవలంబించు పద్ధతిని గురించి న్యా॥ బాగ్ వివరించిరి:

ముర్షిదాబాదు రాజ్‌షాహీ జిల్లాల మధ్య సరిహద్దు విషయమై యేర్పడిన తగాదాలో భారతదేశ న్యాయవాది వాదమును ప్రారంభించవలెనని పాకిస్థాను న్యాయవాది సమాధానమిచ్చునని ఆయన చెప్పెను.

(2) మధుభంగనదికి సంబంధించిన తగాదాలో పాకిస్థాను న్యాయవాది వాదము ప్రారంభింపవలెనని భారతదేశ న్యాయవాది సమాధానము చెప్పవలెను.

(3) పథారియా కొండ రిజర్వు ఫారెస్టు తగాదాలో భారత న్యాయవాది వాదము ప్రారంభించవలెను. పాకిస్థాన్ న్యాయవాది సమాధానము చెప్పవలెను.

(4) కుషియరీనది గతి విషయమైయేర్పడిన తగాదాలో పాకిస్థాన్ న్యాయవాది వాదము ప్రారంభింపవలెను. భారత న్యాయవాది సమాధానమివ్వవలెను. పటములను, ప్రతులను ముందుగనే ఉభయపక్షములవారు విచారణ సంఘ కార్యదర్శికి దాఖలు చేయవలెనని అధ్యక్షుడు చెప్పెను.

### భారత న్యాయవాది వాదము

ముర్షిదాబాదు రాజ్‌షాహీ జిల్లాల సరిహద్దు తగాదా విషయమై భారత న్యాయవాది ఎస్. ఎస్. ఎస్. బోసుగారు వాదము ప్రారంభించుచు ఈ సరిహద్దుగీటు విషయమై రాడ్‌క్లిఫ్ గావించియుండిన నిర్ణయముపై విచారణ సంఘమువారి దృష్టిని ఆకర్షించిరి. ఇండియా ప్రభుత్వంవారు తెలిసికొనగోరుచుండిరనిరి. పోలీసుస్టేషనుబట్టి రాడ్‌క్లిఫ్ ఈ సరిహద్దుగీటును గీసెనని, రెండు పోలీసుస్టేషనుల మధ్య గంగానది మారెనని ఆయన చెప్పెను. భారత అధీనములో చేరవలసియున్న ఈ గ్రామములు తనకు రావలెనని పాకిస్థాను కోరుచుండెనని ఆయన చెప్పెను.

పాకిస్థాన్ న్యాయవాది షేక్ గారు ఈ వాదమునకు సమాధానము చెప్పుచు ఈ రెండుజిల్లాల సరిహద్దుగీటు రెండు స్వతంత్ర దేశములకు సరిహద్దుగీటుగా నున్నదనిరి. అంతర్జాతీయముగా నున్నదనిరి. ఈ సరిహద్దుగీటు నిర్ణయించుటలో అంతర్జాతీయ న్యాయశాస్త్రమును [illegible] సరిహద్దు స్థిరమైన దగా, ఎన్నటికిని మారనిదిగా నుండవలెనని భారత ప్రభుత్వమువారు వాదించుచుండగా ఈ జిల్లాల సరిహద్దు గంగనది సంకటము చేత అంతర్జాతీయ న్యాయశాస్త్ర సిద్ధాంతములను, నిబంధనలను అనుసరించి సరిహద్దుగీటు మారునదిగా నుండవలెనని పాకిస్థాను వాదించుచున్నదనిరి.

రాబోవు బుధవారమువరకు విచారణ వాయిదా పడినది.

# జరూసలెంపై అంతర్జాతీయ పరిపాలన

## అమెరికా తీవ్ర ప్రాతికూల్యం

లేక్‌సక్సెస్, డిసెంబరు 6: జరూసలెం నగరంపై అంతర్జాతీయ పరిపాలన నెలకొల్పడానికి తాము అంగీకరించేదిలేదని, ఇందుకు సంబంధించి 17 రాజ్యాల ఉపసంఘం తయారుచేసిన తీర్మానానికి ప్రతికూలంగా ఓటు చేస్తామని అమెరికా ప్రతినిధి జాక్‌లాస్, యీ పేళ సమితి రాజకీయ సంఘంలో ప్రకటించాడు.

1947 నవంబరులో పాలస్తీనాను విభాగిస్తు ఐక్యరాజ్య సమితి ఆమోదించిన తీర్మానముల పరకు ప్రకారం జరూసలెంను ప్రత్యేక పరిపాలిత ప్రాంతంగా పరిగణించి, నగరంపై అంతర్జాతీయ పరిపాలన నెలకొల్పాలని, 17 రాజ్యాల ఉపసంఘం తీర్మానించింది.

ఆస్ట్రేలియా ప్రతినిధులు ఈ తీర్మాన ప్రతిపాదకులలో ముఖ్యులు. గనుకను, మొదటగా యీ తీర్మానంపై సమితి రాజకీయ సంఘం ఓటు చేయాలని పట్టుబట్టారు. తీర్మాన ముఖ్య ప్రతిపాదకులలో మరొకరైన లెబనాన్ ప్రతినిధి చార్లెస్ మాలిక్, ఉపసంఘ నివేదికను తప్పుదారి పట్టించుటకు ప్రయత్నం జరుగుతున్నదని విమర్శించాడు.

జరూసలెం పరిపాలనకు సంబంధించిన వివిధ ప్రతిపాదనలపై ప్రతినిధి వర్గాలు తమ తమ ప్రభుత్వాలతో సంప్రదించేందుకు వ్యవధి యిస్తూ, సమితి రాజకీయ సంఘం, రేపటికి వాయిదా పడింది.

### ఇజ్రాయిల్ ప్రాతికూల్యం

టెల్ అవీవ్ డిసెంబరు 6: జరూసలెం నగరపరిపాలనను ఇజ్రాయిల్ ప్రభుత్వం ససేమిరా వదులుకోదని, ఇజ్రాయిల్ ప్రధాని డేవిడ్ బెన్‌గూరియన్ పార్లమెంటులో ప్రకటించారు.

# తుపాను ప్రాంత ప్రజలకు వస్త్ర సహాయం

మదరాసులోని సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసయిటీవారు యిట్లు ప్రకటించుచున్నారు: తుపానులో దెబ్బతిన్న ప్రజలకు గ్రామసీమలందు బట్టలు కావలసియున్నవి. ఇప్పటికి 5 పెద్ద మూటలు ఏలూరికి పంపితిమి. వాటి పంపకం ఏర్పాటులు చేయుటకు ఎస్. ఆర్. వెంకట్రామనుగారు వెళ్ళిరి. విద్యాసంస్థలు సాను భూతిగల పెద్దలు మంచి వాడుక చేయు దగ్గ ప్రాతబట్టలు కి, వస్తుకోటులకోడు రాయపేటకు పంపవచ్చును. ప్రాకులు ద్రాయరులు, నిక్కర్లు చీరలు యిత్యాదులు బిడ్డల తోట బరివారు హోము గార్డులు ఆంధ్రమహిళా సభవారు, సేవా సమాజంవారు, అమీను కవలిపతి శ్రీ వావిళ్ల వెంకటేశ్వర్లుగారు ప్రాత వస్త్రములు యిచ్చిరి ఇంకను కావలసియున్నవి.

# త్యాగరాజస్వామి ఆలయ సందర్శనం

## తిరువారూర్‌లో గవర్నర్‌కు స్వాగతం

తిరువారూర్, డిసెంబరు 6: మద్రాసు గవర్నర్ భావనగరమహారాజాగారు నేడు ఉదయం, ఇక్కడ శ్రీ త్యాగరాజస్వామి ఆలయాన్ని దర్శించారు. ఆలయధర్మకర్త వీరికి స్వాగతమిచ్చాడు, చరిత్రాత్మకమైన ఆలయ గోపురాన్ని ధర్మకర్త గవర్నర్ గారికి చూపించాడు. తిరువారూర్ మునిసిపల్ కౌన్సిలు కూడా గవర్నర్ కు సన్మానపత్రాన్ని సమర్పించింది.

## తంజావూరుజిల్లాకు గవర్నరు విన్నపం

నాగపట్నం, డిసెంబరు 6:- గవర్నరు భావనగరు మహారాజాగారు నేడు యీవూరు చూచి రాత్రి స్పెషలు రైలులో మదరాసు వెడలిపోయిరి. తమ దక్షిణదేశ సంచారం గూర్చి వారిట్లు తెలిపిరి:—

"సంచారమంతయు చాల సరదాగా నుంది. ముఖ్యంగా ఈప్రాంతాల దేవాలయ గోపురముల తీరు అద్భుతముగ నున్నవి. తంజావూరు జిల్లావారికి ప్రత్యేకంగా నొక విన్నపం చేయదలచితిని. దక్షిణాది ధాన్యపుగిడ్డంగియగు యీ జిల్లా యిపుడు మిగిలినదంతా యితర జిల్లాలకు యిచ్చి తోడ్పడ వలసి యున్నది.

# వివిధ రాజ్యాల ఆటం ఆయుధాల లెక్క వివరాలు

## ఐక్యరాజ్యసమితిలో రష్యా తీర్మానము

లేక్‌సక్సెస్, డిసెంబరు 6: ఆయా రాజ్యాలవద్దనున్న ఆటం ఆయుధాలలెక్క జాబితాలను తయారు చేయించవలెనను తీర్మానమును ఐక్యరాజ్య సమితిలో రష్యా ప్రతినిధి ప్రతిపాదించెను. కాని, యీ తీర్మానము ఓడిపోయెను. రష్యన్ తీర్మానమును రష్యన్ పక్షరాజ్యాలును యీజిప్టున్నూ ఆమోదించి అనుకూలంగా వోట్లు యిచ్చెను. రష్యా ప్రతిపాదించిన తీర్మానము ప్రకారముగా ఆటం ఆయుధాల లెక్క వివరములు మాత్రమేగాక ఇతర అంతర్జాతీయ ధర్మసమ్మతమైన ఆయుధాల లెక్క వివరములను, సాయుధ సైనికదళముల లెక్కల వివరములనుకూడా తయారుచేయవలెనని కోరబడెను. ఈ తీర్మానమునకు ఐక్యరాజ్యసమితిలో 35 రాజ్యాలు ప్రతిఘటించెను. 9 రాజ్యాల ప్రతినిధులు గైరు హాజరైరి.

సమితి సమావేశములో రష్యను తీర్మానము త్రోసి వేయబడినప్పటికీ దానికి బదులుగా మరొక తీర్మానము ఆమోదింపబడెను.

చిరసంప్రదాయ సమ్మతమైన ఆయుధాలున్నూ, సాయుధ సైనికదళములున్నూ ఆయా రాజ్యములకు ఎంత పరిమితివరకు వుండవలెనో ఎంతవరకు తగ్గించవచ్చునో ఆ విషయమై భద్రతామండలి తన పరిశోధనను సాగించుచుండవలెనని ఐక్యరాజ్యసమితి కోరుచున్నది. అనే తీర్మానము ఆమోదింపబడెను.

ఈ తీర్మానమును ఫ్రాన్సు, నార్వే ప్రతిపాదించెను. ఈ తీర్మానమునకు 44 గురు అనుకూలంగాను 5 గురుమాత్రం ప్రతికూలంగాను వోట్లు యిచ్చిరి. 5 రాజ్యాలవారు వోట్లు యివ్వలేదు. రష్యను తీర్మానానికి వోటు యివ్వకుండ ఉన్న రాజ్యాలలో యుగోస్లావియా యున్నూ ఇజ్రాయేలున్నూ కలవు.

# ఈనెల 20న హైద్రాబాద్‌కు రాజాజీ ఆగమనం

హైద్రాబాద్, డిసెంబరు 6: ఇండియా గవర్నరు జనరల్ సి. రాజగోపాలాచారిగారు డిసెంబరు 20 సైమ నూరుకుండి యిక్కడకు వస్తున్నారని నిన్న యిక్కడ అధికారరీత్యా ప్రకటింపబడింది. ఆయన యిక్కడ మూడురోజులుంటారు. రాజగోపాలాచారిగారు యిక్కడకువచ్చినప్పుడు ఆయనకు పౌరసన్మానం జరుగవలెనని హైద్రాబాద్ సికంద్రాబాద్ మునిసిపాలిటీలు నిన్న సాయంకాలం సంయుక్త సమావేశం జరిపి నిర్ణయించినవి.

గవర్నరు జనరలుగారి రాకనుపురించి ప్రజలు అమిత ఉత్సాహం ప్రకటిస్తున్నారు. ప్రధానవీధులలోని ఇండ్లకు వల్ల వేయబడుతున్నది. వాకింపేట విమానాశ్రయానికి వెళ్ళేరోడ్లు యితర ముఖ్యమైన రోడ్లు మంచిస్థితిలో నుంచబడుతున్నవి.

## విడుదల

శ్రీవానపల్లి పోతరాజు, అను విశాఖపట్నం కమ్యూనిస్టు ని మాధవస్వామి యరని (మలబారు) క్షమాపణ యిచ్చినందున ప్రభుత్వంవారు విడుదలచేసిరి.

# భీమా చట్ట సవరణ బిల్లు

## పార్లమెంటులో వాణిజ్యమంత్రి ప్రతిపాదన

### కొత్తఅంశాల వివరణ

న్యూఢిల్లీ, డిసెంబరు 6: ఇన్సూరెన్సు చట్టాన్ని సవరిస్తూ ఒక సవరణబిల్లు నేడు పార్లమెంటులో చర్చకు వచ్చింది.

ఇంతవరకు ఇది వరుసగా మూడుసార్లు సెలెక్టుకమిటీకి పంపించబడింది. ఆఖరికి భాభా వాణిజ్య శాఖామంత్రి వుండగా ఆయన దాన్ని ఉపసంహరించుకొన్నారు.

ఇప్పుడు దాన్ని కొంచెంగా పరిష్కరించి వాణిజ్యమంత్రి శ్రీ కె. సి. నియోగి నేడు పార్లమెంటులో ప్రవేశపెట్టారు.

ఆయనకూడా సెలెక్టుకమిటీకి పంపాలని కోరుతూనే పార్లమెంటులోకి తెచ్చారు. ఆ కమిటీవారు దానిని డిశంబరు 15 లోపల తిరిగి పార్లమెంటుకు దానిని సమర్పించాలన్నారు.

ఈబిల్లు శ్రీ శాస్త్రి జహాంగీరుకమిటీ రిపోర్టును ఆధారంగా తీసికొని తయారు చేశారు.

ఇందులో పూర్వం బిల్లులో అన్ని అంశాలతోపాటు ఇంకో మూడు కొత్తఅంశాలు వున్నాయి.

బ్యాంకులకు ఇన్సూరెన్సు కంపెనీలకు మధ్య ఎటువంటి సన్నిహితమైన సంబంధమూ లేకుండా చూడాలని ఈ బిల్లు ఆకాంక్షిస్తున్నది.

ఇందులో ఉదాహృతములైన ముఖ్యమైన మార్పులు ఇవి:

( ) వ్యయ నియమం వుండాలి. నియమాన్ని తీర్చిదిద్దేందుకు ఇన్సూరర్ల సంఘాన్ని ఒకదాన్ని చట్టబద్ధమైన దానిని ఏర్పాటుచేయాలి.

(2) ఇన్సూరెన్సు వ్యవహారాలలో ప్రభుత్వానికి మితిలేని అధికారాలు ఈ బిల్లువల్ల లభిస్తాయి. వీటిని సవినీక్షిస్తూ వుండేందుకు ప్రభుత్వం ఇన్సూరెన్సు కంట్రోలర్ జనరల్‌ను నియమిస్తుంది.

(3) ఇన్సూరెన్సు కంపెనీలు తమ ఆస్తులను ఏవిధంగా ఉపయోగించవలసిందీ కూడా ఈ బిల్లు నిర్ణయిస్తుంది. వారు సగం ఆస్తులను ప్రభుత్వము, ప్రభుత్వము ఆమోదించిన సెక్యూరిటీలలోను, మిగతా వాటిని షెడ్యూలు బ్యాంకులలోను వుంచవచ్చును.

ఈ బిల్లును పార్లమెంటుకు ముందుకు తెస్తూ వాణిజ్యశాఖామంత్రి శ్రీ నియోగి ఇన్సూరెన్సు కంపెనీలమీద పెత్తనం వహిస్తున్న పెద్దపెద్ద పెట్టుబడిదార్ల ఏవిధంగా అధిపత్యాన్ని వహిస్తున్నదీ వివరించినమీద ఈ బిల్లులో చేర్చిన కొత్త అంశాలను గూర్చి అతి దీర్ఘప్రసంగం చేశారు.

ప్రాప్రయిటర్ల అధీనంలో నడుస్తున్న కంపెనీలను మ్యూచుయల్ ఇన్సూరెన్సు కంపెనీలగా నడపవచ్చునని ఈ బిల్లులో చేర్చామని, అంధుమూలంగా వాటిని జాతిపరం చేయడం విషయమైన సమస్యను గూర్చి ఒక మధ్యేమార్గాన్ని అనుసరించడం జరిగిందని శ్రీ నియోగి అన్నారు.

ఇవాళ్ళ దీనిమీద జరిగిన చర్చలో నల్గురు సభ్యులుమాత్రమే పాల్గొన్నారు.

వారు శ్రీ టి. టి. కృష్ణమాచారి, ప్రొఫెసర్ షా, పండిట్ గోవిందమాలవీయా, శ్రీ ఆర్. కె. సిధ్వా గారలు.

శ్రీరంగా ఏర్పడివున్న రోగాన్ని కుదర్చడానికి తగిన విధంగా ఈ బిల్లు సన్నద్ధం చెయ్యబడలేదని, కంపెనీల చే సే స్పెక్యులేషన్ చర్యలను అరికట్టజాలుతు యీ బిల్లుప ఎక్కువగా లేదని శ్రీ టి. టి. కృష్ణమాచారిలా అన్నారు.

డైరెక్టర్లలో ఎవరికైనా సరే మొత్తం ఓట్లలో ఒక్క ఓటును ఉపయోగించుకోగల అధికారమే వుండాలంటూ ఈ బిల్లు స్పష్టం చేయాలని ఆయన కోరుతూ, డైరెక్టర్లబోర్డులో విధిగా ప్రభుత్వం తరఫు వ్యక్తికూడా ఒకడు ఇందులో సభ్యుడుగా వుండాలని ఉద్ఘాటించారు.

ప్రొఫెసర్ షా శ్రీ ఆర్. కె. సిధ్వాలు ఇన్సూరెన్సు కంపెనీలను జాతీయపరం చెయ్యాలని సూచించారు. వ్యయ నియమాన్ని గూర్చి బిల్లులో వున్న అంశాలను మెచ్చుకుంటూ, అట్టి మొత్తాన్ని దేశంయొక్క అభివృద్ధికోసం వినియోగించవలసిందని కోరారు. ఇట్లా వ్యయనియమాన్ని విధించడం మంచి ఆదాయమార్గమని అంటూ, ప్రభుత్వం వీటిని యింకను జాతీయం చేయరాదో తనకు అర్థం కావడంలేదని శ్రీ సిధ్వా అన్నారు.

చిన్న ఇన్సూరెన్సు కంపెనీల యోగక్షేమాలను మనస్సులో వుంచుకొని యీ బిల్లు జనరల్ ఇన్సూరెన్సు కంపెనీలకు వర్తించకుండా చూడాలని శ్రీ గోవిందమాలవ్యా కోరారు.

రేపుకూడా దీనిమీద చర్చ జరుగుతుంది.

# ముస్లిమ్ దేశముల మధ్య వాణిజ్య ఒడంబడికలు

## ఇస్లామిక్ ఆర్థిక సభ నిర్ణయము

కరాచీ, డిసెంబరు 6: ఇస్లామిక్ ఆర్థిక మహాసభ వారు గత రాత్రి బహిరంగ సభలో ముఖ్యమైన ఒక నివేదికను ఆమోదించిరి. వివిధ ముస్లిమ్ దేశములు ద్విపాక్షికమైన వాణిజ్య ఒడంబడికలు చేసికొనవలెనని ఈ నివేదిక కోరుచున్నది. సభవారు నియమించిన వాణిజ్యోపసంఘము ఈ నివేదిక సమర్పించిరి. దానిలో యింకను యీ క్రింది సూచనలు కలవు. ముస్లిమ్ ప్రపంచము సందంటబ మెట్రిక్ విధానము నవలంబింపవలెను. వాణిజ్యాభివృద్ధికిగాను వివిధ దేశములు యితర దేశములకు ఆఫీసులను చూపవలెను. వాణిజ్య సంబంధమైన సౌకర్యములు సమకూర్చవలెను. ఇతర దేశములలో వర్తకము ప్రారంభించుటకు ముస్లిములకు సౌకర్యము లొసంగవలెను, కొన్ని షరతులకు లోబడి యితర ముస్లిమ దేశములలో స్వేచ్ఛగా ప్రయాణము చేయుటకు హక్కు వుండవలెను. వ్యాపార నమూనాలను మార్చుకొనవలెను.

టర్కీ ప్రతినిధి అధ్యక్షతను జరిగిన ఈ సభ సవరణలు లేకుండా సాంకేతిక, శాస్త్ర విద్యను గూర్చియు, కార్మిక విషయములను గూర్చియు, భూగర్భ పరిశోధనను గూర్చియు ఉపసంఘములు సమర్పించిన నివేదికలను ఆమోదించెను.

# ఉమ్మడి నగరంవుంటే విభజన వీలు

మదరాసు, డిసెంబరు 6:

ఉమ్మడిగా తాత్కాలిక రాజధాని నగరంవుంటే విభజన వీలు అని మద్రాసు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి ప్రభుత్వానికి సూచించినట్లు తెలుస్తోంది. ప్రత్యేక సిబ్బందిపెట్టి పనిచేస్తే 1950 కు విభజన పూర్తి చేయవచ్చుననీ, లేకపోతే 1951 వరకు విభజనకార్యాలుసాగవచ్చుననీ తెల్పినటుల తెలుస్తోంది. శాసనసభ విభజన అంతగడ్డు సమస్య కాదనీ అయా సభ్యుల విభజించడం తేలికఅనీ తెలిపిరి.

హోంశాఖ కోరినటుల వివరాలన్నీ ఇప్పుడే ఇక్కడే తేలాలంటే కొన్ని సంవత్సరాలవరకూ తేలవనీ స్థూలంగాచేస్తే 1951 కి సాధ్యమని తెలిపినటుల తెలుస్తోంది.

శ్రీ కళా వెంకట్రావుగారు ఆర్థికమంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారితో రాష్ట్ర నిర్మాణాన్ని గూర్చి చర్చించారు.

# బీబీనగర్ కేసు

## రజ్వీ తదితర ముద్దాయీలపై నేరారోపణ

హైద్రాబాద్, డిసెంబరు 5: బీబీనగర్ కేసు విచారిస్తున్న ప్రత్యేక న్యాయవిచారణ సంఘంవారు నేడు పనూ వేళమైన కేసు ముద్దాయీలపై నేరారోపణలు చెయ్యటం జరిగింది. విచారణ సంఘాధ్యక్షులు జె. ఎ. పింటోగారు ఒక్కొక్క ముద్దాయిపై ఏఏ నేరములు ఆరోపింప బడినవో చదివారు.

"ఈ కేసులో మొదటి ముద్దాయి అయినసయ్యద్ కాశిం రజ్వీపై 128 సెక్షన్ (దోమ్మీ) 124 (మారణాయుధములతో దోమ్మీ), 380 (బందిపోటుతనం) 177 (సాక్ష్యనిర్మూలన, దానికి ప్రోత్సాహమిచ్చుట) క్రిందనేరములు మోపబడినవి. మొదటిముద్దాయి మిగిలిన 5 గురు ముద్దాయిలతో కలిసి 1948 జనవరి 10 సాయంకాలం 5 గంటలనుండి 8 గం. వరకు బీబీనగర్‌లో ఉండెను. వీరు అక్కడ కొంతమంది రజాకర్లతో కలిసి, దొంగతనం, బందిపోటుతనం, దోమ్మీ మొదలుగునవి చేశారు. ఇంతేగాక మారణాయుధములు, అనగా లాఠీలు, కత్తులు మొదలగునవి ధరించి 124 సెక్షన్ క్రింద నేరాలు చేశారు. మరణాయుధాలతో వీరు ఆ గ్రామంలో అనేక ఇండ్లపై పడి బందిపోటుతనం చేసి, 380 వ సెక్షన్ క్రింద నేరాలు చేశారు. ఇంతేగాక మొదటి ముద్దాయి సాక్ష్య నిర్మూలనకు 5 వ ముద్దాయిని ప్రోత్సహించెను.

కేసులోని మిగిలిన ముద్దాయిలు దోమ్మీ బందిపోటుతనం మొదలైన వాటి లోపాల్గొని 128, 124, 380, 264 (ప్రమాదకరమైన గాయాలు కలుగజెయ్యటం) సెక్షన క్రింద నేరాలు చేశారు. 5 వ ముద్దాయి రక్తం మరకలు ఉన్న చొక్కాయలను తగులబెట్టి సాక్ష్య నిర్మూలన చేసి, 177 వ సెక్షన్ క్రింద నేరం చేసెను." అని పింటోగారు చదివారు.

తమపై మోపబడిన నేరములను చదువుతుండగా కాశిం రజ్వీ తదితర ముద్దాయిలు మొండిచూపు చూస్తూ కూర్చున్నారు.

"నీ వేమైనా చెప్పుకొంటావా" అని కోర్టువారు రజ్వీని అడుగగా "నేను నిర్దోషిని ఇంతకంటే నేనేమీ చెప్పదలచుకోలేదు. నా వకీల్లు ప్రాసిక్యూషన్ సాక్షులను క్రాసు పరీక్ష చేస్తారు" అని నెమ్మదిగా చెప్పెను.

ఇదే విధంగా మిగిలినముద్దాయిలుకూడా చెప్పారు. అనంతరం కోర్టు డిసెంబరు 12 కి వాయిదా వేయబడింది. ఆనాడు ప్రాసిక్యూషన్ సాక్షులను డిఫెన్సు వకీల్లు క్రాసు పరీక్ష చెయ్యటం ప్రారంభమవుతుంది.

కాశింరజ్వీ వకీల్ ముస్తాఫాహుస్సేన్ నేడు, బీబీనగర్ కేసులో ముద్దాయిలను విచారించుటానికి యీ విచారణసంఘమునకు గల అధికారయోగ్యతలను గురించి ప్రశ్నించెను. ఈ విషయంపై డిఫెన్సు వాదం వినుటకు విచారణసంఘం డిశంబరు 10 న సమావేశమవుతున్నది.

# హైద్రాబాద్ సికింద్రాబాద్ మునిసిపాలిటీల ఎన్నికలు

హైద్రాబాద్, డిసెంబర్ 6: హైద్రాబాద్ సికింద్రాబాద్ మునిసిపాలిటీల ఎన్నికల సందర్భంలో ఓటర్ల జాబితాలు సికింద్రాబాద్‌లో 12 ప్రదేశాలలోను, హైద్రాబాద్‌లో 15 ప్రదేశాలలోను ప్రజల పరిశీలన నిమిత్తం ఉంచబడినవి. ఈ ఎన్నికలు వయోజన ఓటింగు పద్ధతిమీద జరుపబడును. హైద్రాబాద్‌లో ఒక లక్షా 50 వేల మంది వయోజనులు సికింద్రాబాద్‌లో 60 వేల మంది వయోజనులు ఎన్నికలలో పాల్గొంటారని తెలుస్తున్నది. ఎన్నికలు ఫిబ్రవరిలో జరుగునని.

సాయిఫుల్లా ఖాన్, ఖాన్ అహమ్మద్ వెంకట్రావు అనువారు సంస్థాన బయటివారనీ వీరు హైద్రాబాద్ సంస్థానంలో నుండరాదనీ ప్రభుత్వం ప్రకటించింది

# సీతాఫల్మండిలో కొట్లాట

## ముగ్గురికి గాయాలు: 20 మంది అరెస్టు

సికంద్రాబాద్, డిసెంబరు 5: గత రాత్రి సికంద్రాబాద్ పరిసరాలలో సీతాఫల్మండివద్ద జరిగిన కొట్లాటలో గాయాలు తగిలిన చిలకలగూడా పోలీసు హెడ్ కానిస్టేబు, మరియిద్దరు, కె. ఇ. ఎం. ఆస్పత్రిలో చేర్పబడినారు ఈ యిద్దరిలోను ఒకడు చిలకలగూడా వార్డు కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడట.

గతరాత్రి దాదాపు 60 మంది లాఠీలతోను కర్రలతోను కొట్టుకొన్నారట. ఆ సందర్భంలో కొన్ని యిండ్లను సగలగొట్టి దోచుకోవటంకూడా జరిగిందిట. పరిస్థితి వెంటనే అదుపులోకి తీసుకొనిరాబడింది. యీ కొట్లాట సందర్భంలో యింతవరకు 20 మంది అరెస్టు చెయ్యబడినారు. ఇంకా దర్యాప్తు జరుగుతున్నది.

# టిబెట్టుగతి ఏమిటి?

## దళయిలామాను కమ్యూనిస్టులు మాయంచేస్తారా

లండను, డిసెంబర్ 5 చైనాలో చాంకైషేకు ప్రభుత్వం అంతర్థానమై కమ్యూనిస్టుప్రభుత్వ మేర్పడింది అందువల్ల టిబెట్టుగతి ఏమగును అనేది ప్రస్తుతం పత్రికలలో చర్చనీయాంశంగా ఉంది టిబెట్టుదేశం ఇండియాకు సరిహద్దుగా ఉండుటచేత అది మరింత ప్రాముఖ్యం లోనికి వచ్చింది. కమ్యూనిస్టు చైనాసేనలు టిబెట్టుమీదకు దండయాత్ర సాగింపక పోవచ్చును. కాని టిబెట్టులోనే కమ్యూనిస్టు పక్షము చే టిబెట్టు అధిపతి యగు దళాయిలామా మీద తిరుగుబాటును ప్రేరేపించవచ్చును దళాయిలామాను ప్రభుత్వాధికారము నుండి తొలగించి, కమ్యూనిస్టు పలుకుబడిలో ఉండెడి మరొక లామాను అధిపతిగా ప్రతిష్ఠించవచ్చును

దళాయిలామాకు పోటీగా వలసిన రెండవ లామా ఒకరికి తన పక్షమునకు 15 వేల మందిని టిబెట్టులో చేర్చుకున్నాడని తెలియుచున్నది. ఒకవేళ దళాయిలామాను టిబెట్టునుంచి ఎత్తుకొనిపోయి మాయంచేయుటకు ఏదైనా ప్రయత్నములు జరుగుచుండవచ్చునని ఇంగ్లండులోని డెయిలీ గ్రాఫిక్ పత్రికవ్రాయుచున్నది.

# ఎర్నెస్టుబెవిన్ ఆగమనావకాశం

లండన్, డిసెంబరు 6 రానున్న జనవరి 26 వ తేదీన భారత రిపబ్లిక్ అవతరణోత్సవ సందర్భంలో బ్రిటిష్ విదేశాంగ శాఖామంత్రి ఎర్నెస్టు బెవిన్ హాజరు అవకాశాన్ని గురించి ఆలోచన జరుగుచున్నట్లు బ్రిటిష్ విదేశాంగశాఖా ప్రతినిధి ఒకరు నేడు తెలియజేశారు

# రెండవ ప్రపంచయుద్ధ సమయంలో అమెరికానుండి రష్యాకు అణ్వస్త్ర సామగ్రి: వాలెస్‌పై ఆరోపణ

వాషింగ్టన్, డిసెంబరు 6: రెండవ ప్రపంచ యుద్ధకాలంలో అమెరికానుండి రష్యాకు అణ్వస్త్ర నిర్మాణ సామాగ్రి ఎగుమతి చేయబడిందనీ, యిందులో అమెరికా మాజీ ఉపాధ్యక్షుని ప్రోత్సాహంకూడా వున్నదని రేడియో వ్యాఖ్యాత ఫుల్టన్ లూయీ నేటి రాత్రి వెల్లడించాడు. ఆ కాలంలో రష్యాకు అణ్వస్త్ర నిర్మాణ సామాగ్రిని పంపాలని వాలెస్ పట్టుబట్టాడట. అమెరికన్ అణ్వస్త్రనిర్మాణానికి సంబంధించిన ఉద్యోగులు అధిక్షేపించినప్పటికీ యీ అధిక్షేపణలను లెక్కపెట్టకుండా రష్యాకు ఎగుమతులు పంపబడినవని లూయీ అన్నాడు.

రేడియో కార్యక్రమంలో లూయీతోపాటు, మాజీ సైనికోద్యోగి మేజర్ జార్జి రేసీ కూడా పాల్గొన్నాడు.

రష్యా ఉద్యోగులు. అణ్వస్త్రసాధన సామాగ్రిని, పెనాను, కొలుమా చిత్రపటాలను, 1943-44 నాటి కాలంలో అమెరికానుండి రష్యాకు పంపడం తాను కళ్ళార చూచానని అమెరికన్ వ్యతిరేక చర్యల దర్యాప్తు కమిటీ యెదుట సాక్ష్యమిచ్చాడు.

యుద్ధకాలంలో అరువు కవులు పద్ధతి క్రింద, అమెరికానుండి రష్యాకు, అణ్వస్త్ర పరికరాలు ఎగుమతి చేయబడినట్లు తమకు కావలసినంత సాక్ష్యం లభించిందని, మాజీ అమెరికన్ సైనికోద్యోగి ఒకరు యీ సాక్ష్యం బలపడే వాఙ్మూలంకూడా యిచ్చారని, అమెరికన్ ప్రజాప్రతినిధి సభవారు, అమెరికన్ వ్యతిరేక చర్యల దర్యాప్తుకు నియోగించిన కమిటీ అధికారులు ప్రకటించారు.

1944 లో అణుబాంబు మందు సామగ్రి, యురేనియన్ భారీయెత్తున, రష్యాకు పంపబడినవని, వీటిని పంపుటకు రూజ్‌వెల్టు స్వంతకార్యదర్శి హాప్కిన్స్ కూడా విరిగా ఈ త్రివ్యాలు పొందడం కూడా జరిగిందని, మాజీ లియజాన్ ఆఫీసర్ జార్జి జోర్డన్ శుక్రవారంనాడు రేడియోలో తెలిపాడు.

గత యుద్ధకాలంలో రష్యాకు అమెరికానుండి ఆటం ఆయుధ నిర్మాణార్థమైన పదార్థములను రవాణాచేసియుండవచ్చని హెన్రీవాలెస్ గారు నేటి రాత్రి ఖండిస్తూ ఒక ప్రకటన చేసిరి.

# ప్రభుత్వాధీన భూములకు పరిహారం

ఇంతకు ముందు భారత రక్షణమంత్రి సర్దార్ బలదేవ్‌సింగ్ ప్రభుత్వం స్వాధీనం చేసుకున్న భూములకు పరిహారాన్ని ఎట్లా యివ్వాలి అనే విషయాన్ని గూర్చిన ఒక బిల్లును ప్రవేశపెట్టారు.

కలకత్తా హైకోర్టువారు యిచ్చిన ఒక తీర్పునకు మూలంగా ఈ బిల్లు అవసరమైంది.

# సింధియాకంపెనీ వారి చతుర్థ నౌక "జలపంఖి" జలప్రవేశం

## నౌకానిర్మాణ పరిశ్రమకు ప్రభుత్వంసరియైన సహాయంచెయ్యాలనివాల్చంద్‌హీరాచంద్‌ఉద్ఘాటన

విశాఖపట్నం, డిసెంబరు 6: విశాఖపట్నం నౌకానిర్మాణశాలను గూర్చి, నౌకానిర్మాణానికి సంబంధించిన యితర సమస్యలను గూర్చి భారత ప్రభుత్వం త్వరలో సరియైన నిర్ణయాలను చేయగలదని ఆశిస్తున్నానని, సింధియా నౌకానిర్మాణ కంపెనీ అధ్యక్షుడు వాల్చంద్ హీరాచంద్ నేడిక్కడ "జలపంఖి" అనే క్రొత్త నౌకను జలప్రవేశం చేయిస్తూ అన్నారు.

ఈ సందర్భంలో ఆయన ఇంకా ఇలా అన్నారు:

"నౌకానిర్మాణమును సింధియావారు జాతీయ వ్యవహారంగానే పరిగణించారు గాని స్వార్థంకోసం [illegible] ఎన్నడూ భావించలేదు. ఈ పరిశ్రమకు ప్రభుత్వం ధనసహాయం చేస్తుందని ఆశిస్తు వున్నాము, కాని యీ విషయంలో అన్నికాలం [illegible] వచ్చి [illegible] పరిశ్రమలు దీర్ఘకాలపు ఫలితములు [illegible] లేదు. తక్షణమే ఏదో సరియైన చికిత్స చేసి తీరాలి.

సింధియా కంపెనీ యాజమాన్యం సరిగ్గాలేదని కొందరు విమర్శిస్తున్నారు. కాని ఇంతకాలంవరకూ నౌకానిర్మాణపరిశ్రమ ఈదేశంలో ప్రభుత్వ ధనసహాయం మేమీ లేకుండానే తనబలంతో నిలబడుతున్నదనే సంగతిని వారు గుర్తించడంలేదు. ఏ దేశంలోనూ ఈపరిశ్రమ ప్రభుత్వ ధన సహాయం లేకుండా అభివృద్ధికానేలేదు. ఇండియాలో ఉక్కు, బట్టలు, పంచదార మొదలైన పరిశ్రమలకు కోట్లకొద్దీ రూపాయల ప్రభుత్వసహాయం లభిస్తుండగా, విదేశీయుల పోటీకి బాగా దెబ్బతినగల స్థితిలో వున్న నౌకా పరిశ్రమకుమాత్రమే ప్రభుత్వ సహాయం లభించలేదు"

## రేడియో ప్రోగ్రాములు

డిసెంబరు 9 శుక్రవారం

### మద్రాసు (ఏ)

ఉ 7-30 ఆర్. మహాలక్ష్మి పాట 8-0 ఇంగ్లీషున వార్తలు 8.15 ఉదయ సంగీతం (రి) 8-30 మద్రాసు (బి) వలె మ 1-30 ఆంగ్లమున వార్తలు 1-40 సినిమా సంగీతం (రి) 4-30 పాశ్చాత్య సంగీతం (రి) సా 5-30 రఘుజారంజని పాట 6-0 ఆంగ్లమున వార్తలు 6-20 కె. ఎస్. చంద్రశేఖరయ్య పాట 7-30 గీతమంజరి (రి) 7 4 జంత్రసమ్మేళనం 8-15 ఎ ఎస్. చంద్రశేఖరశాస్త్రి వీణ 9-0 ఆంగ్లమున వార్తలు 9-15 విశ్వవిద్యాలయాలకు టి. వి రామమూర్తి ఆంగ్లప్రసంగం 9-30 మద్రాసు (బి) వలె.

### మద్రాసు (బి)

ఉ 7-0 తెలుగున వార్తలు 7-45 చిత్తూరు సుబ్రహ్మణ్యపిళ్లై రికార్డులు 7 45 మద్రాసు (ఏ) వలె 8-30 ఎ. కె. సుబ్బారావు వేణువు మ. 12-0 కార్మికుల కార్యక్రమం 12 30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు దుస్తుల జాగ్రత చినిగిన దుస్తులను కుట్టుకోవటం ప్రసంగం సాంక్రామిక రోగములు టైఫాయిడ్-డాక్టరు గారి ప్రసంగం 1-30 మద్రాసు (ఏ) వలె 1-50 తెలుగున వార్తలు 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు వార్తాసమీక్ష. పి. వి. ఆర్. శర్మ. మన ఆహారము ధాతువర్ధక ఆహారము డాక్టరు ప్రసంగం 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు లలితకళలు సంగీతం ప్రసంగం వి. లీల పాట కథ కోతి పిచికలు ప్రథమచికిత్స ట్యూటర్ ప్రమాదము. డాక్టరుగారి ప్రసంగం సా. 5-30 మద్రాసు (ఏ) వలె 6-20 సాయం సంగీతం (రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం. గ్రామాలలో విద్యుచ్ఛక్తి దూరతీరాల కలయిక ప్రసంగం. వింతకోరికలతో ఘట్టశాస్త్రి గేయం విశేషాలు ప్రకటనలు ధరలు వాతావరణ వివరాలు 7 తెలుగున వార్తలు 7-15 ఆసియాలో నవోదయం పారిశ్రామిక సంపత్తి ప్రసంగం మానవుడా ఓ మానవుడా శ్రీశ్రీ గేయం 8-15 మద్రాసు (ఏ) వలె. శ్రోతలుకోరిన పాటలు రికార్డులు. 10 భావగీతాలు ప్రయాగ నరసింహశాస్త్రి.

### విజయవాడ

7 తెలుగున వార్తలు 7-15 ఎస్. సంతకోకిలం రికార్డులు 7-30 చెంబోలు వెంకటశాస్త్రి వీణ 8 ఆంగ్లమున వార్తలు 8-15 గీతావళి వత్రి సత్యవతి 9-30 వి అంకయ్య పాట మ. 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు 1 శారావథం (రి) 1-30 ఆంగ్లమునవార్తలు. 1-50 తెలుగున వార్తలు. 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు. 5-30 కె. పద్మ. వయొలిన్ 6-0 ఆంగ్లమున వార్తలు. 6.20 గీతావళి వత్రి సత్యవతి. 7-0 తెలుగున వార్తలు 7-30 చిత్రవాణి (రి) 7-45 చరిత్ర శాఖాముఖలు. వాఙ్మయము. ప్రసంగం మారెమండ రామారావు. 8-0 చెంబోలు వెంకటశాస్త్రి వీణ. 8-30 వి. అంకయ్య పాట. 9-0 ఆంగ్లమునవార్తలు. 9-15 'పారిజాతాపహరణము' హరికథా కాలక్షేపం కోనపల్లి గురునాథరావు.

### హైద్రాబాదు

ఉ 7-45 నాట్. గులాంమహమ్మద్ 7-50 ఖవాలీ రికార్డులు. 8-0 ఆంగ్లమున వార్తలు 8-20 సంపత్ కుమార్ కర్ణాటక సంగీతం 8-50 తెలుగున వార్తలు. 9-15 పిల్లల కార్యక్రమం. తెలుగున. 'తాతపెండ్లి' నాటిక రచన. యం. కృష్ణమూర్తి ప్రశ్నలు, జవాబులు భారతదేశములోనిచారిత్రకప్రదేశాలు 'మైసూరు' ప్రసంగం ఎ వీరభద్రరావు. మ. 12-30 డ్యూయట్ రికార్డులు. 1-0 సభోవీధి రికార్డులు 1.30 ఆంగ్లమున వార్తలు 1-50 తెలుగున వార్తలు (ఎ.ఐ.ఆర్.రిలే) సా॥ 5-0 యశోదాబాయ్, ఖయాల్ ముల్తానీ 5-15 దక్కన్ రేడియో ఖవాలీ పార్టీ 5-45 అజీజుర్ రహమాన్ చాంద్రా గీత్ 5-40 యశోదాబాయ్ తుమ్రీ. 6-30 గ్రామస్థుల కార్యక్రమం తోటపంటలు (2) వారింజ ప్రసంగం. ఎన్. భోజరాజానాయుడు గీతావళి. టి. ఎల్. కాంతారావు ఆరోగ్యసూత్రాలు. డాక్టర్ ప్రసంగం 7-0 తెలుగునవార్తలు (ఎ. ఐ ఆర్ రిలే) 7-15 ద్విపదకావ్యపఠనం గీతావళి టి ఎల్. కాంతారావు. 7-45 హైద్రాబాదులో కళాకేంద్రాలు. 'ఎల్లోరా' తెలుగున ప్రసంగం. సూపాటి వెంకటరమణారావు. 7-55 అజీజుర్ రహమాన్ గీత్ 8-30 దక్కన్ రేడియో కవాలీపార్టీ 8-40 యశోదాబాయ్ ఖయాల్ యమన్. 8-50 అజీజుర్ రహమాన్ గీత్. 9-0 ఆంగ్లమునవార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే) 9-15 యశోదాబాయ్ ఖయాల్. 9-45 అజీజుర్ రహమాన్. చాంద్రాఘజల్. 9-55 సంపత్ కుమార్ కర్ణాటకసంగీతం. 10-25 యశోదాబాయ్ తుమ్రీ. 10 35 సంపత్ కుమార్ కర్ణాటకసంగీతం.

## అస్సాంరాష్ట్రంలో గవర్నర్ జనరల్ పర్యటన

ఉసాయీలు, డప్లాలు, నాగజాతులమధ్య రాజాజీ-గవర్నర్ జనరలు అస్సాం పోయినపుడు కొండజాతులవారిని చూచిరి.

నాగజాతి సిపాయికి గవర్నరు జనరల్ మిలిటరీ మెడలు తగిలించుట.

ఇరాన్ పాలకుడు మహమ్మద్ రిజాషా పలావి మహీంషాగారికి అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ స్వాగత మొసంగి వెంట గొంపోవుట.

మంగళగిరిలో తుపాను బాధితులకు వస్త్రదానం.

## చలామణీ విలువ తగ్గింపు ఫలితం

### గోధుమ ధర నూటికి 44 వంతుల వరకూ పెరుగుతుంది

న్యూఢిల్లీ, డిసెంబర్ 5: "చెలామణీ విలువ తగ్గింపు కారణంగా, గోధుమ ధర నూటికి 44 వంతుల వరకూ పెరుగవచ్చు. కాని బయటినుంచి వచ్చే బియ్యం దిగుమతులను వీలైనంత తగ్గించి వేయటానికి ప్రభుత్వం నిర్ణయించిన కారణంగా బియ్యంధర మాత్రం తగ్గిపోవచ్చును. 1950లో అర్జెంటైనా నుంచి 3 లక్షల 90 టన్నుల గోధుమలు దిగుమతి చేసుకోవటానికి ఒడంబడిక చేసుకున్నాం. 1950కి గాను మరియితర దేశాలు కేటితోనూ యే ఆహారపుఒడంబడిక జరగలేదు, అని ఆహారమంత్రి యీ వేళ పార్లమెంటులో ప్రకటించారు. "అధికాహారోత్పత్తి కార్యక్రమం క్రింద 1947-48 6.72 లక్షల టన్నులూ, 1948-49లో 14 లక్షల టన్నులూ అదనపు ఉత్పత్తి జరిగింది, అని, తెలియజేశారు.

ప్రశ్న: వేరుశనగపిట్టు విషయంలో జరిగిన పరిశోధనలో యేమి తేలింది.

జవాబు: మడ్డీజిడ్డూ లేకుండా చేస్తే ఆహారంలో నూటికి 5 వంతుల చొప్పున ఉపయోగించవచ్చు.

ప్రశ్న: ఇంకెందుకన్నా పనికొస్తుందా?—

జవాబు: ఎరువుగా పనికివస్తుంది.

## ఇండియాలో యుద్ధ విమానాలనిర్మాణం

### పార్లమెంటులో డా॥ శ్యామ ప్రసాదుముఖర్జీగారి ప్రకటన

ఢిల్లీ, డిసెంబరు 6: నేడు ఇండియా పార్లమెంటులో ప్రశ్నోత్తర సమయమునందు ఇండియా ప్రభుత్వ పరిశ్రమలశాఖామంత్రియగు డా॥ శ్యామప్రసాదముఖర్జీ గారు హెచ్. వి. కామతుగారడిగిన ప్రశ్నకు సమాధానముగా యిట్లు చెప్పిరి.

హిందుస్తాన్ ఎయిర్ క్రాఫ్ట్ కంపెనీ వారు కొత్తరకపు పోరాటవిమానమును 1950 సంవత్సరం మార్చిలో తయారు చేయగలరు. అందుకొరకై యుద్ధవిమానములను తయారుచేయుటలో జగత్ప్రసిద్ధి వహించిన మెస్సర్స్మిట్ గారి సేవాసహాయములు ఇండియా ప్రభుత్వమునకు లభించును. వీరు త్వరలోనే ఇండియాకు విచ్చేసెదరు. యుద్ధవిమానములను నడిపించుటయందు శిక్షణనుపొందెడివారికొరకైన ట్రెయినింగువిమానములు మాత్రము హిందుస్తాన్ ఫ్యాక్టరీలో తయారగుచున్నవి. ఈ ట్రెయినింగువిమానములలో మూడురకములు తయారగుచున్నవి. ఇక పోరాటవిమానమును తయారుచేయవలెనని సంకల్పించడమైనది. అందుకు ఒక బ్రిటిష్ వ్యాపారసంస్థతో కంట్రాక్టు ఏర్పరచుకొనడమైనది. ఇండియా ప్రభుత్వసైనిక శాఖవారు సూచించినవిధంగా ఈ కొత్త పోరాట విమానము తయారుచేయబడును.

## సభలు సమావేశములు

పశ్చిమ గోదావరిజిల్లా కాంగ్రెసు సర్వసభ్య సమావేశం 16-12-49 తేదీ మధ్యాహ్నం 3 గంటలకు తాడేపల్లిగూడెం తాలూకా కేశవరం గ్రామంలోని జిల్లా బోర్డు హైస్కూలులో జరుపబడును. గాన సభ్యులెల్లరు తప్పక హాజరుకాగోరుచున్నామని ప్రధాన కార్యదర్శి వి. గంగరాజుగారు తెలియజేస్తున్నారు.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ వయోజన విద్యాశాఖయొక్క కార్యనిర్వాహకవర్గ సమావేశము ఈ నెల 10 వ తేదీ మధ్యాహ్నము 12 గంటలకు విజయవాడ సమీపమునందలి పటమటలంకలోని సర్వోత్తమ భవనమున జరుగును.

## మదరాసు ధరలు

మదరాసు, డిసెంబరు 7:

బంగారు వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1కి ఎక్కువ బొంబ్బాయి సేల్సుటాక్సుతోసహా రు. 76 14.0 పెట్లా బంగారు తులం 115.0-0 మూసబంగారు 118-4-0 సీమవెండి తులం 1-0.8 (రెడీ 171-8-0 తులం 1-8 1-12 0

వేరుసెనగ: (581 శా 1-8 ఎరువు కోస్తా గిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతోసహా) బజారు కొత్తది. రు. 162-0-0 (కోరమాండల్) 168-0-0 (కాండిప్) వేరుసెనగనూనె ఎక్స్ పెల్లర్ (పీపరేట రు. 380-0-0 2టు5% యఫ్. యఫ్. ఎ. కొంకాయనూనె (37 శాట్ల కల డబ్బా) ఒకటికి కొచ్చిన్ క్వాలిటీ. రు. 23-10-9, 35-12-9

**ఆముదం**

కాండి 500 శౌనులుగలది (ఒంగోల్) రు. 260, 265.(నరసరావుపేట) రు. 270, 275-0-0

**పంచదార**

| | | |
|---|---|---|
| సర్కాటాగంజ్ (2బిందరు) | | రు. 94-9-5 |
| సాసర్ పూర్ | ,, | రు. 93-14-0 |
| మోతీపూర్ | ,, | రు. 94-7-10 |
| చిల్లరధర | వీశ 1-8 | 1 5-8 |

### న్యూయార్కు దూది

న్యూయార్కు, డిసెంబరు 6:

మార్చివాయిదా ధరలు

| | | | |
|---|---|---|---|
| నేటి | ప్రారంభం | జెల | 30 29 |
| | నిన్న | | 30.28 |
| ,, | ముగింపు | జెల | 30.26 |
| | నిన్న | | 30.27 |



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No 7, Thambu Chetty St., G. T. Madras.